# చైనా రాజ్యాంగచట్టం దాని విశిష్టత





విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# చైనా రాజ్యాంగ చట్టం : : దాని విశిష్టత



తీ షావ్-చీ

★



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# నవచైనా రాజ్యాంగచట్టం

## అవతారిక

చైనా ప్రజలు ఒక శతాబ్దం వీరోచితంగా పోరాడి, 1949 లో చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సామ్రాజ్యవాదంపైన, ఫ్యూడలిజంపైన, బురాక్రటిక్ పెట్టుబడిదారీ విధానంపైన అంతిమ విజయాన్ని సాధించారు. చైనా దీర్ఘకాల పీడిత, బానిస చరిత్రను అంతమొందించి చైనా ప్రజా రిపబ్లిక్‌ను – అనగా నూతన ప్రజాస్వామిక నియంతృత్వాన్ని – స్థాపించుకొన్నారు.

చైనా ప్రజారిపబ్లిక్ యొక్క నూతన ప్రజాస్వామికపద్ధతి చైనాదేశం శాంతియుతంగా దోపిడీని, బీదరికాన్ని తొలగించడానికి, భాగ్యవంతమైన, సుఖప్రదమైన సోషలిస్టు సమాజాన్ని సృజించటానికి హామీనిస్తోంది.

చైనా ప్రజారిపబ్లిక్ స్థాపననుంచి సోషలిస్టు సమాజం సాధించుకునేవరకు గల కాలము ఒక పరివర్తన కాలము. ఈ పరివర్తనకాలంలో రాజ్యాంగం (State) యొక్క కేంద్రకర్తవ్యం క్రమక్రమంగా దేశాన్ని సోషలిస్టుపద్ధతిలో పారిశ్రామికం చేయడం; క్రమక్రమంగా వ్యవసాయంలో, చేతిపరిశ్రమల్లో, పెట్టుబడిదారీ పరిశ్రమల్లో, వర్తకంలో సోషలిస్టు పునర్నిర్మాణాన్ని సాధించడం. గడచిన కొద్ది సంవత్సరాలలో మన ప్రజలు

భూ సంస్కరణలను విజయవంతంగా కొనసాగించారు. అమెరికా దురాక్రమణను ప్రతిఘటించి కొరియాకు సాయపడ్డారు. విప్లవ ద్రోహుల్ని అణచివేశారు. జాతీయ ఆర్థిక వ్యవస్థను పునరుద్ధరించారు. ఇంకా ప్రణాళికాబద్ధమైన ఆర్థిక నిర్మాణాన్ని కొనసాగడానికి, సోషలిజంవైపుకు నిచ్చలమైన పరివర్తన పొందడానికవసరమైన పరిస్థితులను కలుగజేసిన తదితర పెద్ద పోరాటాలను సాగించారు.

చైనా ప్రజా రిపబ్లిక్ యొక్క ప్రథమ జాతీయ ప్రజా సభ 1954 సెప్టెంబరు 20 వ తేదీని రాజధాని అయిన పెకింగులో జరిగిన తన ప్రథమ సమావేశంలో ప్రథమ రాజ్యాంగచట్టాన్ని ఆమోదించింది. ఈ రాజ్యాంగచట్టం 1949 లో ఏర్పడిన చైనా ప్రజల రాజకీయ సమాలోచనసమితి (Chinese People's consultative conference) లో ఆమోదింపబడిన ఉమ్మడి కార్యక్రమంపై ఆధారపడింది; దానినుండే అభివృద్ధిచేయబడింది. ఇది చైనా ప్రజావిప్లవం సాధించిన ఫలితాలను, చైనా ప్రజా రిపబ్లిక్ స్థాపించిననాటినుండి సాధించిన రాజకీయ, ఆర్థిక విజయాలను సంఘటితం చేస్తున్నది. అంతేకాక పరివర్తనదశలో వున్న రాజ్యాంగంయొక్క ప్రాథమికావసరాలను, సోషలిస్టు సమాజ నిర్మాణంచేయ నభిలషించే ప్రజాబాహుళ్యం యొక్క ఉమ్మడి ఆశయాలను ప్రతిబింబించుతోంది.

చైనా ప్రజారిపబ్లిక్ స్థాపనకొరకు గావించిన మహత్తర పోరాటంలో, చైనాప్రజలు విశాలమైన నూతన ప్రజాస్వామిక ఐక్యసంఘటనను ఒకదాన్ని నిర్మించారు. అది చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన అన్ని ప్రజాస్వామికవర్గాలను, పార్టీలను,

గ్రూపులను, ప్రజాసంస్థలతోను కూడియున్నది. భవిష్యత్తులో కూడా చైనా నూతన ప్రజాస్వామిక ఐక్యసంఘటన (People's Democratic United Front) యీ పరివర్తనదశలో రాజ్యాంగముయొక్క మూలకర్తవ్యాలను నెరవేర్చే పోరాటంలో దేశప్రజలందరిని సమీకరించి ఐక్యపరచుటలోను, దేశంలోపలి, బయటి శత్రువులను ఎదిరించుటలోను తన పాత్రను నిర్వహించుతూనే వుంటుంది.

స్వతంత్రమైన, సమాన హోదాకల జాతులతో కూడిన పెద్ద కుటుంబంలో చైనా జాతులన్నీ ఐక్యమైయున్నవి. చైనా జాతుల యీ ఐక్యత తమలోతాము చేసికొనే పరస్పర సహాయ అభివృద్ధిమీద, వారి సామ్రాజ్యవాద వ్యతిరేకతమీద, యీ విభిన్నజాతులలోనే వున్న ప్రజాశత్రువులపట్ల వారికిగల వ్యతిరేకతమీద, పెత్తందారీ జాతీయ దురహంకారం, స్థానిక జాతీయ దురభిమానాలపట్ల వారికిగల వ్యతిరేకతలమీద ఆధారపడి మరింత బలోపేతంగా వృద్ధిఅవుతుంది. ఆర్థిక సాంస్కృతిక అభివృద్ధి క్రమంలో యీ అన్ని విభిన్నజాతుల అవసరాలనుగూర్చి రాజ్యాంగం జాగ్రత్త తీసికొంటుంది. సోషలిస్టు పునర్నిర్మాణం విషయంలో వాటివాటి ప్రత్యేకలక్షణాల అభివృద్ధికి పూర్తిగా శ్రద్ధ వహించుతుంది.

చైనా దేశం యిప్పటికే సోవియటు యూనియనుతోను, నూతనప్రజాస్వామిక ప్రభుత్వాలతోను, దుర్భేద్యమైనస్నేహాన్ని నిర్మించుకొంది. మనప్రజలకు, శాంతికాముకులయిన ప్రపంచ ప్రజలందరకు మధ్య స్నేహం దినదిన ప్రవర్ధమానం అవుతోంది. ఈస్నేహం నిర్విరామంగా అభివృద్ధిచేయబడి, సంఘటితపరచ

బడుతుంది. సమానత్వం, పరస్పరప్రయోజనం, సార్వభౌమాధికారాన్ని, సరిహద్దులను పరస్పరం గౌరవించుకోవటం అను సిద్ధాంతములపై ఆధారపడి అన్ని దేశములతో దౌత్యసంబంధాలను ఏర్పర్చుకొనే మనదేశపు విధానం మంచిఫలితాలను యిచ్చింది. అదే విధానాన్ని చైనాదేశం యికముందుకూడా అచంచలంగా కొనసాగించుతుంది. అంతర్జాతీయ వ్యవహారాల్లో మహోత్కృష్టమైన ప్రపంచశాంతికి, మానవాభివృద్ధికి కృషి చేయడమే మన దృఢమైన, అచంచలమైన విధానం.

*

# మొదటి ప్రకరణం

## సాధారణసూత్రాలు

ఆర్టికలు 1:

చైనా ప్రజారిపబ్లిక్ కార్మిక, కర్షక ఐక్యతపై ఆధారపడి కార్మికవర్గంచే నడుపబడే నూతన ప్రజాస్వామిక రాజ్యాంగం (People's - Democratic State).

ఆర్టికలు 2:

చైనా ప్రజారిపబ్లిక్‌లోని అధికారమంతయు జాతీయ ప్రజాసభచేత, స్థానిక ప్రజాసభలచేత ప్రాతినిధ్యం వహింపబడిన ప్రజలదే.

జాతీయ ప్రజాసభ, స్థానిక ప్రజాసభలు, తదితర రాజ్యాంగ సంస్థలు కేంద్రీకృత ప్రజాస్వామ్యమును (Democratic Centralism) ఆచరించును.

ఆర్టికలు 3:

చైనా ప్రజారిపబ్లిక్ ఐక్యపరచబడిన అనేకజాతుల రాజ్యాంగం (State).

అన్నిజాతులు సమానహోదాగలవి. ఒక జాతిపట్ల వివక్షత చూపుటగాని, ఒకజాతిని అణచియుంచుటగాని,

జాతులమధ్య ఐక్యతకు విఘాతంకలిగించు చర్యలుగాని నిషేధింపబడినవి.

అన్ని జాతులు తమ తమ వాడుకభాష, లేక వ్రాసే భాషలను వుపయోగించుకొనుటకు, అభివృద్ధి పరచుకొనుటకు స్వాతంత్రం కలిగియున్నవి. అవి తమ ఆచారములను, అవాట్లను నిలబెట్టుకొనుటకుగాని, సంస్కరించుకొనుటకుగాని స్వాతంత్రం కలిగియున్నవి.

అల్పసంఖ్యాక జాతులప్రజలు ఎక్కువగా నివసించే ప్రాంతములలో స్థానికస్వపరిపాలన అమలుజరుపబడును. జాతీయ స్వపరిపాలన గల అన్ని ప్రాంతములు చైనా ప్రజా రిపబ్లిక్‌లో అవిభాజ్య భాగములు.

ఆర్టికలు 4:

చైనా ప్రజారిపబ్లిక్ రాజ్యాంగ సంస్థలపైన, సమాజ శక్తులపైన ఆధారపడియు, సోషలిస్టు పారిశ్రామికీకరణద్వారాను, క్రమంగా దోపిడీవిధానమును రద్దుపరచుటకును, సోషలిస్టు సమాజమును నిర్మించుటకును హామీనికలుగజేస్తున్నది.

ఆర్టికలు 5:

ప్రస్తుత ప్రజాచైనా రిపబ్లిక్‌లో ఉత్పత్తిసాధనాల యాజమాన్యపు మూలరూపాలు యీదిగువ విధంగావుంటాయి:

(1) ప్రభుత్వ యాజమాన్యం (State ownership) అనగా ప్రజలందరి యాజమాన్యం.

(2) సహకార యాజమాన్యం (Co-operative ownership) అనగా శ్రామికప్రజల సమిష్టియాజమాన్యం.

(3) శ్రామికప్రజల వ్యక్తిగత యాజమాన్యం.

(4) పెట్టుబడిదారీ యాజమాన్యం.

ఆర్టికలు 6:

ప్రభుత్వపు యాజమాన్యంలోగల ఆర్థికరంగం, సోషలిస్టు స్వభావం కల్గింది. అనగా ప్రజలందరు దానికి యజమానులన్న మాట. ఇదే జాతీయఆర్థికవ్యవస్థలో నాయకత్వంవహించే శక్తి. ప్రభుత్వంచేత కొనసాగించబడే సోషలిస్టు పునర్నిర్మాణానికి భౌతిక ప్రాతిపదిక కూడాయిదే. ఆ ఆర్థికవ్యవస్థలోని ప్రభుత్వ భాగపు అభివృద్ధికే ప్రథమస్థానం యివ్వడానికి రాజ్యాంగం హామీని కలుగజేస్తుంది. అన్ని ఖనిజసంపదలు, జలాశయాలు, అడవులు, లాప్రకారం ప్రభుత్వానికిచెందిన, అభివృద్ధి చెందని భూములు, యింకా యితరసంపదలు ప్రజలందరి ఆస్తియై యున్నవి.



ఆర్టికలు 7:

జాతీయ ఆర్థికవ్యవస్థలో కో-ఆపరేటివ్ భాగం శ్రామిక ప్రజల ఉమ్మడి యాజమాన్యం క్రిందవున్నప్పుడు సోషలిస్టు స్వభావాన్ని, కొంతవరకే శ్రామిక ప్రజల ఉమ్మడియాజమాన్యం క్రిందవున్నప్పుడు అర్థ సోషలిస్టు స్వభావాన్ని కలిగి యుంటుంది. కొంతవరకే శ్రామికప్రజల ఉమ్మడి యాజమాన్యం ఉండడం ఒక పరివర్తన రూపం. దీనిద్వారా వ్యక్తిగత రైతులు, వ్యక్తిగత చేతివృత్తులవారు, తదితర వ్యక్తిగత శ్రామికప్రజలు శ్రామిక ప్రజలందరి సమిష్టి యాజమాన్యస్థితికి పురోగమిస్తారు. రాజ్యాంగం కో-ఆపరేటివుల ఆస్తినికాపాడుతుంది. ఆర్థికవ్యవస్థలోని యీ కో-ఆపరేటివు భాగాన్ని ప్రోత్సహించి, సలహాలిస్తూ,

దాని అభివృద్ధికి సాయపడుతుంది. ఎందువల్లననగా వ్యక్తిగత వ్యవసాయం, వ్యక్తిగత చేతిపరిశ్రమలలో పరివర్తన తీసికొని వచ్చుటకిదే ప్రధానమైన సాధనం గనుక.

ఆర్టికలు 8:

భూములకు, యితర ఉత్పత్తి సాధనాలకు రైతు యజమానిగా వుండే హక్కును రాజ్యాంగం లా ప్రకారం కాపాడుతుంది.

ఒంటరి రైతులను సలహాలిస్తూ అతడు అధికోత్పత్తి సాధించటానికి రాజ్యాంగం సాయపడుతుంది.

ఉత్పత్తి, మార్కెటింగు, సరఫరా, పరపతి, కో-ఆపరేటివు సంఘాలను ఐచ్ఛికంగా ఏర్పాటు చేసుకొనేలాగు ప్రోత్సహించుతుంది.

ప్రభుత్వ విధానం ధనిక రైతు వ్యవస్థను అదుపులో పెట్టుతూ క్రమేణా రద్దుచేస్తుంది.

ఆర్టికలు 9:

వ్యక్తిగతంగా చేతివృత్తి కార్మికులు, వ్యవసాయేతర శ్రామిక ప్రజలు ఉత్పత్తి సాధనాలు కలిగి యజమానులుగా ఉండే హక్కును రాజ్యాంగం లా ప్రకారం కాపాడుతుంది.

అట్టి చేతివృత్తి కార్మికులకు, వ్యవసాయేతర శ్రామిక ప్రజలకు సలహాలిస్తూ, వారి వ్యాపారం అభివృద్ధి అయ్యేలాగు సాయపడుతుంది. వారు, ఉత్పత్తి, సరఫరా, మార్కెటింగు కో-ఆపరేటివు సంఘాలను ఐచ్ఛికంగా స్థాపించుకొనేలాగు ప్రోత్సహించుతుంది.

ఆర్టికలు 10 :

పెట్టుబడిదారులు తమ తాలూకు ఉత్పత్తిసాధనాలకు, పెట్టుబడికి యజమానులుగా వుండేహక్కును రాజ్యాంగం లా ప్రకారం కాపాడుతుంది.

పెట్టుబడిదారీ పరిశ్రమ, వర్తకంగూర్చి రాజ్యాంగ విధానం ఏమనగా : "ఉపయోగించాలి; అదుపులోవుంచాలి; సంస్కరించాలి." ప్రభుత్వ పరిపాలకశాఖల కంట్రోలు ద్వారా, ప్రభుత్వపరిశ్రమల నాయకత్వంద్వారా కార్మికుల అజమాయిషీద్వారా పెట్టుబడిదారీ పరిశ్రమల్లోని, వర్తకం లోని జాతీయశ్రేయస్సుకు ప్రజల జీవనోపాధికి ప్రయోజన కారిగాయుండు సవ్యమైనగుణాలను రాజ్యాంగం ఉపయోగించు కొంటుంది.

పెట్టుబడిదారీ పరిశ్రమ, వర్తకాల్లోని, జాతీయ శ్రేయస్సుకు ప్రజల జీవనోపాధికి ప్రయోజనకారిగాని అవగుణాలను రాజ్యాంగం అరికట్టుతుంది. పెట్టుబడిదారీ పరిశ్రమను, వర్తకాన్ని వివిధరూపాల్లో గల స్టేటుపెట్టుబడిదారీ విధానం లోనికి క్రమేపీ పరివర్తన చెందేలాగు రాజ్యాంగం సలహాలిస్తూ ప్రోత్సహించుతుంది.

పెట్టుబడిదారులు ఏవిధంగాను చట్టవిరుద్ధమైన చర్యలవల్ల ప్రజాప్రయోజనాలకు, విఘాతం కల్గించుటగాని, సాంఘిక, ఆర్థికవ్యవస్థకు, జాతీయ ఆర్థికప్లానుకు, నష్టంకలిగించుటగాని రాజ్యాంగం నిషేధించుతోంది.

ఆర్టికలు 11:

చట్టసమ్మతమైన ఆదాయంలో, కుదువబెట్టిన ధనంలో యిండ్లలో, జీవనోపాధుల్లో పౌరులకున్న హక్కుల్ని రాజ్యాంగం కాపాడుతుంది.

ఆర్టికలు 12:

వ్యక్తిగత ఆస్థిలోను, స్వంత ఆస్థిలోను పౌరులకు గల వారసత్వ హక్కుల్ని రాజ్యాంగం కాపాడుతుంది.

ఆర్టికలు 13:

రాజ్యాంగం ప్రజాప్రయోజనాల నిమిత్తం నగరాలలో గాని, పల్లెప్రాంతాలలోగాని భూమి, యింకా యితర ఉత్పత్తి సాధనాలను క్రయంపొందవచ్చును; వశపరచుకోవచ్చును; లేదా జాతిపరంచేయవచ్చును. అయితే ఇదంతా చట్టసమ్మతంగా నేజరుగుతుంది.

ఆర్టికలు 14:

రాజ్యాంగం ఏ వ్యక్తినైనా తన స్వంతఆస్థిని ప్రజా ప్రయోజనాలకు విఘాతం కలిగించేలాగు ఉపయోగించకుండా నిషేధించుతుంది.

ఆర్టికలు 15:

రాజ్యాంగం ఆర్థిక ప్రణాళికప్రకారం జాతీయ ఆర్థిక వ్యవస్థను ఎడతెగకుండా అభివృద్ధిపరచి పునర్నిర్మిస్తూ, ప్రజల యొక్క భౌతిక, సాంస్కృతిక జీవితాన్ని పెంపొందించి దేశ స్వతంత్రతను, దేశ భద్రతను దృఢతరంచేస్తుంది.

ఆ ర్టి క లు 16 :

ప్రజా చైనా రిపబ్లికలోని పనిచేయగల ప్రతి పౌరునకు పనిచేయటం ఒకగౌరవప్రదమైన విషయం. రాజ్యాంగం పౌరులకు తమ పనిలోని చొరవను, సృజనాత్మకమైన చురుకుతనాన్ని ప్రోత్సహించుతుంది.

ఆ ర్టి క లు 17 :

రాజ్యాంగపు అన్నిశాఖలు ప్రజాబాహుళ్యంపై ఆధారపడాలి: ప్రజలతో ఎడతెగని దగ్గరసంబంధం పెట్టుకోవాలి; వారి అభిప్రాయాల్ని లెక్కలోకి తీసికోవాలి; వారి అజమాయిషీని (Supervision) అంగీకరించాలి.

ఆ ర్టి క లు 18 :

రాజ్యాంగపు శాఖలన్నింట్లో పనిచేసేవారు నూతన ప్రజాస్వామిక వ్యవస్థకు విధేయులయి యుండాలి. వారు రాజ్యాంగచట్టమును, యితర చట్టములను పాటించుతూ తమ శక్తినంతా ప్రజాసేవలో వినియోగించాలి.

ఆ ర్టి క లు 19 :

చైనా ప్రజారిపబ్లిక్ నూతనప్రజాస్వామిక వ్యవస్థను కాపాడుతుంది. అన్నివిధాలయిన విద్రోహ, విప్లవ ప్రతీఘాతక చర్యలను అణచివేస్తుంది. అట్టివిద్రోహులను, విప్లవప్రతీఘాతకులను శిక్షిస్తుంది.

రాజ్యాంగం చట్టసమ్మతంగా ఫ్యూడలుభూస్వాముల, బురాక్రటిక్ పెట్టుబడిదారుల రాజకీయహక్కుల్ని నిర్ణీతకాలం వరకు తొలగించుతుంది. తమ స్వంతశ్రమతో కష్టించి పనిచేసి

పౌరులుగా సంస్కరింపబడుటకు అవకాశం కల్గిస్తూ జీవనోపాధి మాత్రం వారికి కల్గించబడుతోంది.

ఆర్టికలు 20 :

చైనా ప్రజారిపబ్లిక్ సాయుధబలాలు ప్రజలకుచెందినవి. ప్రజావిప్లవ ప్రయోజనాలను, జాతీయ నిర్మాణాన్ని, దేశపు సర్వాధికారాన్ని, దేశసరిహద్దులను, దేశభద్రతను రక్షించుట సాయుధబలాల విధియైయున్నది.

# రెండో ప్రకరణం

# రాజ్యాంగ నిర్మాణం

## 1వ భాగం

## జాతీయ ప్రజా కాంగ్రెసు

ఆర్టికలు 21 :

జాతీయ ప్రజా కాంగ్రెసు చైనా ప్రజా రిపబ్లికులో రాజ్యాంగపు అధికారంగల అత్యున్నతమైనశాఖ.

ఆర్టికలు 22 :

జాతీయ ప్రజా కాంగ్రెసు రాజ్యాంగపు శాసనాధికారం చెలాయించు ఒకే ఒక శాఖ.

ఆర్టికలు 23 :

రాష్ట్రములనుండి, స్వయంపాలిత ప్రదేశములనుండి, కేంద్ర ప్రభుత్వాధికారమునకు లోబడిన మునిసిపాలిటీలనుండి,

సాయుధబలాలనుండి, విదేశములలోని చైనాజాతీయులనుండి ఎన్నుకోబడిన ప్రతినిధులతో జాతీయ ప్రజా కాంగ్రెసు ఏర్పడుతుంది.

జాతీయ ప్రజా కాంగ్రెసుకు ప్రతినిధుల సంఖ్య, వారి ఎన్నికవిధానం, జాతీయ మైనారిటీల ప్రతినిధులు, వారి ఎన్నిక విధానంతోసహా ఎన్నికలచట్టంలో నిర్దేశించబడినది.

ఆర్టికలు 24:

జాతీయ ప్రజా కాంగ్రెసు నాలుగేండ్లకు ఒకపర్యాయం ఎన్నుకోబడును. జాతీయ ప్రజా కాంగ్రెసుయొక్క పదవీకాలము పూర్తికి రెండునెలల పూర్వమే జాతీయ ప్రజా కాంగ్రెసు యొక్క స్థాయిసంఘం తదనంతరపు జాతీయ ప్రజా కాంగ్రెసుకు ప్రతినిధుల ఎన్నిక పూర్తిచేయవలయును. ఎన్నికలు జరుపుటకు వీలుగాని అసాధారణ పరిస్థితులు ఏర్పడినప్పుడు, జాతీయ ప్రజా కాంగ్రెసు పదవీకాలము తదనంతరం వచ్చే జాతీయ ప్రజా కాంగ్రెసు ప్రథమ సమావేశంవరకు పొడిగించబడును.

ఆర్టికలు 25:

జాతీయ ప్రజాకాంగ్రెసు సంవత్సరమునకు ఒక పర్యాయం సమావేశమగును. స్థాయి సంఘము సమావేశ కర్తగా వ్యవహరించుతుంది.

స్థాయిసంఘం అవసరమని తలచినప్పుడుగాని, అయిదోవంతు ప్రతినిధులు ప్రతిపాదించినప్పుడుగాని ఎప్పుడైనా జాతీయ ప్రజా కాంగ్రెసు సమావేశపరచబడును.

ఆర్టికలు 26:

జాతీయ ప్రజా కాంగ్రెసు సమావేశమయినప్పుడు సమావేశ కార్యక్రమం నిమిత్తం అధ్యక్షవర్గాన్ని ఎన్నుకొంటుంది.

ఆర్టికలు 27:

జాతీయ ప్రజాకాంగ్రెసు యీ దిగువ చూపిన విధులను నిర్వహించి, అధికారములను నిర్వహించును.

1. రాజ్యాంగ చట్టమును సవరించును.

2. శాసనములను చేయును.

3. రాజ్యాంగ చట్టం అమలుపరచుటను పరిశీలించును (Supervises).

4. చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నుకొనును.

5. చైనా ప్రజా రిపబ్లికు అధ్యక్షుని ప్రతిపాదనపై ప్రభుత్వమండలి (మంత్రివర్గము) యొక్క ప్రధానమంత్రిని నిర్ణయించును. ప్రభుత్వమండలి ప్రధానమంత్రి ప్రతిపాదనపై మంత్రివర్గ సభ్యత్వాన్ని నిర్ణయించును.

6. చైనా ప్రజా రిపబ్లికు అధ్యక్షుని ప్రతిపాదనపై జాతీయ రక్షణ కౌన్సిలు, ఉపాధ్యక్షుడు, సభ్యుల నియామకాన్ని నిర్ణయించుతుంది.

7. సుప్రీం పీపుల్సుకోర్టు (అత్యున్నత ప్రజా న్యాయస్థానం) కు అధ్యక్షుని ఎన్నుకొనును.

8. ప్రొక్యూరేటర్-జనరల్‌ను (పబ్లికు ప్రాసిక్యూటరు) ఎన్నుకొనును.

9. జాతీయ ఆర్థిక ప్రణాళికను ధ్రువీకరించును.

10. జాతీయ బడ్జెటును, దానికి సంబంధించిన నివేదికను పరిశీలించి ఆమోదించును.

11. రాష్ట్రములయొక్క, స్వపరిపాలిత ప్రదేశముల యొక్క, కేంద్రప్రభుత్వ యాజమాన్యంలో వున్న మునిసిపాలిటీలయొక్క పరిపాలక సరిహద్దులను ఆమోదించును.

12. నేరస్థులను క్షమించేహక్కును కలిగి ఉండును.

13. శాంతి, యుద్ధములకు సంబంధించిన నిర్ణయములు తీసికొనును.

14. జాతీయ ప్రజా కాంగ్రెసు అవసరమనుకొన్న ఏ బాధ్యతనైనా నిర్వహించే అధికారం కలిగిఉండును.

ఆర్టికలు 28 :

జాతీయ ప్రజాకాంగ్రెసు యీ దిగువచూపినవారిని పదవులనుండి తొలగించే హక్కు కల్గియున్నది.

1. చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు; ఉపాధ్యక్షుడు.

2. ప్రధానమంత్రి; ఉపప్రధానమంత్రులు, మంత్రులు; కమిషను అధ్యక్షులు; ప్రభుత్వమండలి చీఫ్ ఆఫ్ సెక్రటేరియేట్.

3. జాతీయ రక్షణకౌన్సిలు ఉపాధ్యక్షుడు; సభ్యులు.

4. సుప్రీం పీపుల్సుకోర్టు అధ్యక్షుడు.

5. ప్రొక్యూరేటర్ జనరల్ (పబ్లికు ప్రాసిక్యూటరు)

ఆర్టికలు 29 :

రాజ్యాంగచట్టమునకు తేబడు సవరణలు నెగ్గుటకు జాతీయ ప్రజాకాంగ్రెసు ప్రతినిధులలో మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదం పొందవలెను.

శాసనములు, తదితర తీర్మానములు జాతీయ ప్రజా కాంగ్రెసు ప్రతినిధులలో సాధారణ మెజారిటీతో నెగ్గగలవు.

ఆర్టికలు 30 :

జాతీయ ప్రజా కాంగ్రెసుయొక్క స్థాయిసంఘం జాతీయ ప్రజాకాంగ్రెసు తరఫున వ్యవహరించే శాశ్వతసంస్థ. జాతీయ ప్రజాకాంగ్రెసు ఆ స్థాయిసంఘాన్ని ఎన్నుకొంటుంది. ఆ సంఘం ఈ క్రిందివారితో ఏర్పడుతుంది.

స్థాయిసంఘం అధ్యక్షుడు; స్థాయిసంఘ ఉపాధ్యక్షులు; ఛీఫ్ ఆఫ్ సెక్రటేరియట్; సభ్యులు.

ఆర్టికలు 31 :

జాతీయ ప్రజా కాంగ్రెసుయొక్క స్థాయిసంఘం యీ దిగువ చూపిన విధులు, అధికారములు నిర్వహించును :

1. జాతీయ ప్రజా కాంగ్రెసుకు ఎన్నికలు జరుపును.

2. జాతీయ ప్రజా కాంగ్రెసుయొక్క సమావేశములను ఏర్పాటుచేయును.

3. శాసనములను వివరించును.

4. డిక్రీలను ఆమోదించును.

5. ప్రభుత్వమండలి, సుప్రీం పీపుల్సుకోర్టు, ప్రొక్యూరేటర్ జనరల్ ఆఫీసుల కార్యకలాపాలపై అజమాయిషీ వహించును.

6. రాజ్యాంగచట్టమునకు, శాసనములకు, డిక్రీలకు విరుద్ధముగానున్న ప్రభుత్వమండలి ఆదేశాలను, నిర్ణయాలను రద్దుచేయును.

7. రాష్ట్రముల, స్వయంపరిపాలిత ప్రదేశాల, కేంద్ర ప్రభుత్వ యాజమాన్యం క్రింద గల మునిసిపాలిటీల ప్రభుత్వాధికారులు తీసుకొనే బేసబబయిన నిర్ణయాలను రద్దుచేయును. లేక సవరించును.

8. జాతీయప్రజాకాంగ్రెసు సమావేశములో లేనపుడు ఉపప్రధానులను, మంత్రులను, కమిషను అధ్యక్షులను, ఛీఫ్ ఆఫ్ సెక్రటేరియట్‌ను పదవిలో నియమించును; బర్తరఫ్ చేయును.

9. సుప్రీం పీపుల్సుకోర్టు ఉపాధ్యక్షులను, జడ్జీలను, కోర్టున కమిటీ మెంబర్లను నియమించును; బర్తరఫ్ చేయును.

10. డిప్యూటీ ప్రొక్యూరేటర్ జనరల్‌ను, ప్రొక్యూరేటర్లను, ప్రొక్యూరేటర్-జనరల్ యొక్క ఆఫీసులోని ప్రొక్యూరేటర్స్ కమిటీమెంబర్లను నియమించును; బర్తరఫ్ చేయును.

11. విదేశములలో రాయబారులను నియమించును; తొలగించును.

12. విదేశములతో చేసికొన్న ఒడంబడికలను ఆమోదించును; రద్దు చేయును.

13. సైనిక, రాజకీయ, తదితర ప్రత్యేక బిరుదులు, హోదాలు సృష్టించును.

14. రాజ్యాంగం తరఫున గౌరవ బిరుదాలు, పతకాలు, ఆర్డర్లు సృష్టించి ప్రదానం చేయుటకు నిర్ణయించును.

15. నేరస్థులను క్షమించేహక్కు కలిగియుండును.

16. జాతీయ ప్రజాకాంగ్రెసు సమావేశంలో లేనపుడు దేశముపై సాయుధ దాడి జరిగినప్పుడుగాని, దురాక్రమణను

వ్యతిరేకంగా, పరస్పరరక్షణ ఒడంబడికల బాధ్యతలనునిర్వ హించ వలసినప్పుడుగాని యుద్ధపరిస్థితిని ప్రకటించును.

17. పూర్తిగాగాని, పాక్షికంగాగాని సైనిక సమీకరణకు ఆజ్ఞాపించును.

18. దేశమంతటాగాని, కొన్ని ప్రాంతాల్లోగాని సైనిక శాసనం ప్రకటించును.

19. జాతీయ ప్రజాకాంగ్రెసు కలుగజేసిన యింకా యితరవిధులు అధికారములు నిర్వహించును.

**ఆర్టికలు 32 :**

జాతీయ ప్రజాకాంగ్రెసుయొక్క స్థాయిసంఘం తదనంతరం అధికారంలోకి వచ్చే జాతీయ ప్రజాకాంగ్రెసు క్రొత్త స్థాయిసంఘమును ఎన్నుకొనువరకు తన విధులను అధికారములను నిర్వహించును.

**ఆర్టికలు 33 :**

స్థాయిసంఘము జాతీయ ప్రజాకాంగ్రెసుకు బాధ్యత వహించును; సంజాయిషీ యిచ్చుకొనును.

స్థాయీసంఘ సభ్యులను తొలగించే అధికారం జాతీయ ప్రజాకాంగ్రెసుకు ఉంది.

**ఆర్టికలు 34 :**

జాతీయ ప్రజా కాంగ్రెసు, జాతుల కమిటీని, బిల్లుల కమిటీని, బడ్జెటు కమిటీని, క్రెడెన్షియల్స్ (అర్హతా నిర్ణాయక) కమిటీని, యింకా అవసరమనుకొన్న యితర కమిటీలను ఏర్పాటుచేయును.

జాతీయ ప్రజా కాంగ్రెసు సమావేశంలో లేనప్పుడు జాతుల కమిటీ, బిల్లుల కమిటీ స్థాయిసంఘపు ఉత్తర్వులకు లోబడి పనిచేయును.

ఆర్టికలు 35 :

ప్రత్యేక సమస్యల విచారణ నిమిత్తం జాతీయ ప్రజా కాంగ్రెసుగాని, అది సమావేశములో లేనప్పుడు స్థాయిసంఘం గాని అవసరమని తోచినప్పుడు ప్రత్యేక కమిటీలను ఏర్పాటు చేయవచ్చును.

ఆయా ప్రభుత్వశాఖలు, ప్రజాసంస్థలు, పౌరులు పై కమిటీలు సాగించే విచారణ సందర్భంలో అవసరమైన సాక్ష్యా ధారాలను ఆ విచారణసంఘానికి విధిగా అందజేయవలెను.

ఆర్టికలు 36 :

జాతీయ ప్రజా కాంగ్రెసు ప్రతినిధులు ప్రభుత్వమండలిని గాని, మంత్రిత్వశాఖలనుగాని, ప్రభుత్వకమిటీలను, కమిషన్లను గాని వ్రాతపూర్వకంగా ప్రశ్నలు అడిగేహక్కు కల్గియున్నారు. అందుకు సమాధానము లిచ్చే బాధ్యత వాటికుంది.

ఆర్టికలు 37 :

జాతీయ ప్రజా కాంగ్రెసుయొక్కగాని, అది సమావేశ ములో లేనప్పుడు స్థాయిసంఘంయొక్కగాని అనుమతి లేనిదే జాతీయ ప్రజాకాంగ్రెసు ప్రతినిధులను అరెస్టుచేయుటగాని కోర్టులలో శిక్షించుటగాని జరగదు.

ఆర్టికలు 38 :

జాతీయ ప్రజాకాంగ్రెసు ప్రతినిధులు వారిని ఎన్నుకొన్న నియోజకవర్గముల అజమాయిషీకి లోబడియుందురు. నియోజక

వర్గములు తమ ప్రతినిధులను వెనక్కి పిలిపించుటకు లేదా వారి స్థానములలో యితరులను భర్తీ చేయుటకు హక్కు కల్గియున్నవి. అయితే యిదంతా చట్టసమ్మతంగానే జరుగుతుంది.

## రెండో భాగం

## చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు

**ఆర్టికలు 39:**

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు జాతీయ ప్రజాకాంగ్రెసుచే ఎన్నుకోబడును. చైనా ప్రజారిపబ్లికు పౌరుడెవరైనా 35 ఏండ్ల వయస్సుకలిగి ఎన్నుకొనుటకు, ఎన్నికవుటకు హక్కు కలిగియున్నచో అధ్యక్షుడుగా ఎన్నుకోబడవచ్చును.

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుని పదవీకాలపరిమితి నాల్గు సంవత్సరములు.

**ఆర్టికలు 40:**

జాతీయ ప్రజాకాంగ్రెసుయొక్క లేక దాని స్థాయి సంఘంయొక్క నిర్ణయాల ననుసరించి, ప్రజాచైనా రిపబ్లికు అధ్యక్షుడు శాసనములను, ఉత్తర్వులను అమలుపరచును;

ప్రధానమంత్రిని, ఉపప్రధాన మంత్రులను, మంత్రులను, కమిషన్ల అధ్యక్షులను, ప్రభుత్వమండలి చీఫ్ ఆఫ్ సెక్రటేరియట్‌ను నియమించును; లేక తొలగించును;

జాతీయ రక్షణకౌన్సిలుయొక్క ఉపాధ్యక్షులను, మెంబర్లను నియమించును; లేక తొలగించును;

జాతీయ గౌరవబిరుదాలను, పతకాలను ప్రదానం చేయును;

శిక్షలను రద్దుచేయును. నేరస్థులను క్షమించును; సైనిక శాసనం ప్రకటించును;

యుద్ధం ప్రకటించును; సైనిక సమీకరణకు ఉత్తర్వుల నిచ్చును.

ఆర్టికలు 41:

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు విదేశ సంబంధము లలో చైనా ప్రజారిపబ్లికు తరఫున ప్రాతినిధ్యము వహించును. విదేశ రాయబారులను స్వీకరించును. జాతీయ ప్రజాకాంగ్రెసు స్థాయిసంఘం నిర్ణయముల ప్రకారం విదేశములలో రాయబారులను నియమించును. లేక తొలగించును. విదేశములతో చేసికొన్న ఒడంబడికలను ధృవపరచును.

ఆర్టికలు 42:

ప్రజాచైనా రిపబ్లికు అధ్యక్షుడు దేశపు సాయుధ బలాలకు సర్వసైన్యాధ్యక్షుడు. జాతీయరక్షణ కౌన్సిలుకు అధ్యక్షుడు.

ఆర్టికలు 43:

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు అత్యున్నత రాజ్యాంగ సభను అవసరమునుబట్టి ఏర్పాటుచేసి దానికి అధ్యక్షత వహించును.

ఈ అత్యున్నత రాజ్యాంగ సభలో ప్రజాచైనా రిపబ్లికు ఉపాధ్యక్షుడు, జాతీయ ప్రజాకాంగ్రెసు స్థాయిసంఘం అధ్యక్షుడు, ప్రభుత్వమండలి ప్రధానమంత్రి, యింకా సంబంధమున్న యితరులు సభ్యులుగా వుంటారు.

ముఖ్యమైన రాజ్యాంగ విషయాలలో యీ అత్యున్నత రాజ్యాంగసభ యొక్క ప్రతిపాదనలను చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు, జాతీయ ప్రజాకాంగ్రెసు ముందుగాని, దాని స్థాయిసంఘం ముందుగాని, ప్రభుత్వమండలి ముందుగాని, యింకా యితర శాఖలముందుగాని పరిశీలించి, నిర్ణయం తీసికొనే నిమిత్తం ప్రవేశపెట్టును.

ఆర్టికలు 44:

చైనా ప్రజారిపబ్లికు ఉపాధ్యక్షుడు అధ్యక్షుని పనిలో సాయపడును. అధ్యక్షుడు ఒప్పగించిన విధులను, అధికారములను నిర్వహించవచ్చును.

ఈ చట్టంలో 39 వ ఆర్టికలులోని అధ్యక్షుని ఎన్నిక, పదవీ కాల పరిమితికి సంబంధించిన నిబంధనలే చైనా ప్రజారిపబ్లికు ఉపాధ్యక్షుని ఎన్నిక, పదవీకాలపరిమితికికూడా వర్తించును.

ఆర్టికలు 45:

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు తిరిగి తదనంతరపు జాతీయ ప్రజాకాంగ్రెసు ఎన్నుకొను అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు పదవులను స్వీకరించువరకు తమ విధులను, అధికారములను నిర్వహిస్తారు.

ఆర్టికలు 46:

చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షుడు అనారోగ్యకారణాలవల్ల చాలకాలంవరకు పనిచేయ అశక్తుడైనచో చైనా ప్రజారిపబ్లికు ఉపాధ్యక్షుడు అధ్యక్షుని తరఫున ఆయన విధులను, అధికారములను నిర్వహించును. చైనా ప్రజారిపబ్లికు అధ్యక్షపదవి ఖాళీ అయినచో ఉపాధ్యక్షుడు అధ్యక్షపదవి నలంకరించును.

# మూడో విభాగం

## ప్రభుత్వ మండలి

**ఆర్టికలు 47 :**

చైనా ప్రజా రిపబ్లికు కేంద్ర ప్రభుత్వమండలి అనగా "కేంద్ర ప్రజా ప్రభుత్వం" రాజ్యాంగాధికారపు అత్యున్నత పరిపాలక సంస్థ. రాజ్యాంగ సంబంధమైన అత్యున్నతమైన పరిపాలకశాఖ.

**ఆర్టికలు 48 :**

ప్రభుత్వమండలిలో ఈ దిగువ చూపబడిన వారుందురు :

1. ప్రధాన మంత్రి
2. ఉపప్రధాన మంత్రులు
3. మంత్రులు
4. కమిషన్ల, కమిటీల అధ్యక్షులు
5. చీఫ్ ఆఫ్ సెక్రటేరియట్

ప్రభుత్వమండలి నిర్మాణం చట్టబద్ధంగా జరుగును.

**ఆర్టికలు 49 :**

ప్రభుత్వమండలి యీ దిగువ చూపబడిన విధులు అధికారములు కల్గియుండును :

1. పరిపాలక సంబంధమైన విషయాలను నిర్దేశించును. నిర్ణయాలను ప్రకటించి ఆజ్ఞలను యిస్తుంది. రాజ్యాంగచట్టం, చట్టాలు, డిక్రీలకు అనుగుణమైన నిర్ణయాలను, ఆదేశాలను జారీచేసి, అవి సక్రమంగా అమలు జరిగేట్లు చూస్తుంది.

2. జాతీయ ప్రజా కాంగ్రెసుకుగాని, దాని స్థాయి సంఘమునకు గాని, బిల్లులను సమర్పిస్తుంది.

3. మంత్రిత్వశాఖలు, కమిటీలు, కమీషన్ల యొక్క పనులను సమన్వయంచేస్తూ నాయకత్వం వహిస్తుంది.

4. దేశమంతటిలోను, అన్ని స్థానిక పరిపాలక సంస్థల కార్యకలాపాలను సమన్వయంచేస్తూ నాయకత్వం వహిస్తుంది.

5. మంత్రులుగాని, కమీషన్ల కమిటీల అధ్యక్షులు గాని జారీచేసిన బేసబబు ఆర్డర్లను, ఆదేశాలను సవరించును. లేక రద్దుచేయును.

6. స్థానిక సంస్థలయొక్క బేసబబు అయిన నిర్ణయాలను, ఆర్డర్లను సరిదిద్దును, లేదా రద్దుచేయును.

7. జాతీయ ఆర్థిక ప్రణాళికను, రాజ్యాంగబడ్జెటును అమలుజరుపును.

8. దేశీయ, విదేశీయ వాణిజ్యంపై అధికారం కలిగి ఉండును.

9. విద్య, వైజ్ఞానిక, ప్రజారోగ్యశాఖల కార్యకలాపాలను నడుపును.

10. జాతులకు సంబంధించిన విషయాలపై అధికారం కలిగియుండును.

11. విదేశాలలో నివసిస్తున్న చైనీయులకు సంబంధించిన విషయాలను చూస్తుండును.

12. రాజ్యాంగయంత్ర ప్రయోజనాలను కాపాడును; ప్రజాశాంతిని కాపాడును. పౌరహక్కులను పదిలపరచును.

13. విదేశములతో సంబంధాలసరళిని నిర్దేశించును.

14. దేశపు సాయుధబలాల విషయాలలో ఆదేశాలు యిచ్చుచుండును.

15. స్వయంపరిపాలిత జిల్లాలు, తాలూకాలు, స్వయం పరిపాలిత తాలూకాలు, పట్టణాల పరిపాలక సరిహద్దులను ధృవపరుస్తుంది.

16. పరిపాలనాశాఖలలోని ఉద్యోగులను చట్టసమ్మతమైన సూత్రాల ననుసరించి నియమించును, లేదా తొలగించును.

17. జాతీయ ప్రజాకాంగ్రెసు లేక దాని స్థాయిసంఘం సంక్రమింపజేసిన యితర విధులను, అధికారములను నిర్వహించును.

ప్రధానమంత్రి ప్రభుత్వమండలి కార్యకలాపాలను నడుపును.

ఆర్టికలు 50:

దాని సమావేశములకు అధ్యక్షత వహించును.

ఉపప్రధాన మంత్రులు ప్రధానమంత్రి పనిలో సాయపడుదురు.

ఆర్టికలు 51:

మంత్రులు, కమీషను కమిటీల అధ్యక్షులు తమ శాఖల కార్యకలాపాల నిర్వహణకు బాధ్యతవహింతురు. ప్రభుత్వమండలి నిర్ణయాలకు, ఆదర్శకు లోబడి తమ శాఖల అధికార పరిధిలో వారు ఆదర్శను, ఆదేశములను జారీచేయవచ్చును.

ఆర్టికలు 52:

సమావేశ మవుతున్నప్పుడు జాతీయ ప్రజాకాంగ్రెసుకు, అట్లు సమావేశం కానప్పుడు దాని స్థాయిసంఘమునకు ప్రభుత్వ

మండలి బాధ్యత వహించి చేసిన పనులకు సంజాయిషీ యిచ్చు కోవాలి.

## నాలుగో విభాగం

### స్థానిక ప్రజాకాంగ్రెసులు : స్థానిక ప్రజాకౌన్సిళ్లు

ఆర్టికలు 53 :

ప్రజాచైనా రిపబ్లికు పరిపాలక విభాగములు ఈ క్రింది విధంగా వుండును:—

1. దేశము రాష్ట్రములుగాను, స్వయం పరిపాలిత ప్రదేశములుగాను, కేంద్ర ప్రభుత్వమునకు లోబడిన మ్యునిసిపాలిటీలుగాను విభజింపబడినది.

2. రాష్ట్రములు, స్వయం పరిపాలిత ప్రదేశములు స్వయంపరిపాలిత 'చౌ'లు గాను, జిల్లాలుగాను, స్వయం పరిపాలిత జిల్లాగాను, మ్యునిసిపాలిటీలుగాను విభజింపబడినవి.

3. జిల్లాలు, స్వయంపాలితజిల్లాలు, సియాంగ్, జాతుల సియాంగ్, పట్టణములుగా విభజింపబడినవి.

కేంద్రప్రభుత్వమునకు లోబడిన మునిసిపాలిటీలు ఇంకా యితర పెద్ద పెద్ద మునిసిపాలిటీలు భాగములుగా విభజింప బడినవి.

స్వయంపాలిత "చౌ"లు, జిల్లాలుగాను, స్వయంపాలిత జిల్లాలుగాను, మునిసిపాలిటీలుగాను విభజింపబడినవి.

స్వయంపాలిత ప్రదేశములు, స్వయంపాలిత "చౌ" లు, స్వయంపాలిత జిల్లాలు అన్నీ కూడా జాతీయ స్వయంపాలనలోని భాగములే.

ఆర్టికలు 54:

రాష్ట్రములు, కేంద్రప్రభుత్వమునకుసరాసరిఆధిపత్యంలో గల మునిసిపాలిటీలు, జిల్లాలు, మునిసిపాలిటీలు, మునిసిపల్ జిల్లాలు, సియాంగులు, జాతుల సియాంగులు, పట్టణాలు తమ తమ ప్రజా కాంగ్రెసులను, ప్రజా మండలులను స్థాపించు కొనును. స్వయంపాలితప్రదేశములు, స్వయంపాలిత "చౌ"లు, స్వయంపాలిత జిల్లాలు, స్వయంపాలక శాఖలను స్థాపించు కొనును. ఇట్టి స్వయంపాలకశాఖల నిర్మాణం, వాటి విధులు రెండో ప్రకరణం ఐదో విభాగంలో వివరించబడినవి.

ఆర్టికలు 55:

స్థానిక ప్రజా కాంగ్రెసులు ఆయా స్థాయిాల రాజ్యాంగాధికారపు శాఖలు.

ఆర్టికలు 56:

రాష్ట్రములయొక్క, కేంద్ర ప్రభుత్వాధికారమునకు లోబడిన మునిసిపాలిటీలయొక్క, విభజింపబడిన జిల్లాల, మునిసిపాలిటీలయొక్క ప్రజా కాంగ్రెసులకు ప్రతినిధులు వాని దిగువ అంతస్తులోగల ప్రజా కాంగ్రెసులచే ఎన్నుకోబడుదురు. భాగములుగ విభజింపబడని మునిసిపాలిటీల, మునిసిపలు జిల్లాల, సియాంగుల, జాతుల సియాంగుల, ప్రజా కాంగ్రెసులకు ప్రతినిధులు సూటిగా వోటర్లవల్ల ఎన్నుకోబడుదురు.

అన్ని అంతస్తుల స్థానిక ప్రజా కాంగ్రెసులకు ప్రతినిధుల ఎన్నిక విధానము వారి సంఖ్య "ఎన్నికలచట్టం" వల్ల నిర్దేశింపబడినవి.

ఆర్టికలు 57 :

రాష్ట్ర ప్రజాకాంగ్రెసు పదవీకాలపరిమితి నాల్గుసంవత్సరములు. కేంద్రప్రభుత్వ పాలనకు లోబడిన మునిసిపాలిటీల, జిల్లాల, మునిసిపాలిటీల, మునిసిపల్ జిల్లాల, సియాంగుల, జాతుల సియాంగుల, పట్టణముల ప్రజాకాంగ్రెసుల పదవీకాల పరిమితి రెండుసంవత్సరములు.

ఆర్టికలు 58 :

ప్రతిస్థాయిలోని ప్రజాకాంగ్రెసు తమ పరిపాలక భాగంలో శాసనాలు, ఆర్డర్లు ఆచరింపబడి అమలు జరిగేలా బాధ్యతవహించును. స్థానిక ఆర్థిక ప్రణాళికలను వైజ్ఞానిక, సాముదాయక కార్యములను నిర్ణయించును; స్థానిక బడ్జెటులను, ఆర్థిక నివేదికలను పరిశీలించి ఆమోదించును;

సాముదాయక ఆస్తులను కాపాడును; ప్రజాశాంతిని కాపాడును; పౌరులహక్కులను జాతీయమైనారిటీల హక్కులను భద్రపరచును.

ఆర్టికలు 59 :

ప్రతి స్థానిక ప్రజాకాంగ్రెసు ఆయా స్థానిక ప్రజామండలియొక్క సభ్యులను ఎన్నుకొనుటకు, తొలగించుటకు హక్కు కల్గియుండును.

జిల్లాలయొక్క, యింకా పై స్థానిక ప్రజాకాంగ్రెసులు ఆయా స్థాయిాల ప్రజాకోర్టుల అధ్యక్షులను ఎన్నుకొనుటకున్ను తొలగించుటకున్ను అధికారము కల్గియున్నవి.

ఆర్టికలు 60:

ప్రతి స్థానిక ప్రజాకాంగ్రెసు శాసనంప్రకారం తనకున్న అధికారపరిధిలో నిర్ణయాలను అంగీకరించి జారీచేయును. జాతుల సియాంగులతాలూకు ప్రజా కాంగ్రెసులు శాసనం ప్రకారం తమకు సంక్రమించిన అధికారములకు లోబడి ఆయాజాతుల స్వభావసిద్ధ లక్షణాలకు సరిపడు ప్రత్యేకపరిమాణములను అవలంబించును. ప్రతి స్థాయిలోని ప్రజాకాంగ్రెసు ఆయా స్థాయి ప్రజాకౌన్సిలు చేసిన బేసబబు నిర్ణయాలను, అర్డర్లను సరిదిద్దుటకు లేక రద్దుచేయుటకుహక్కు కల్గియున్నది. జిల్లాలయొక్క' యింకా ఆ పైస్థాయిల ప్రజాకాంగ్రెసులు తమ దిగువస్థాయిలోని ప్రజాకాంగ్రెసుల, ప్రజాకౌన్సిళ్ళయొక్క బేసబబైన నిర్ణయాలను, ఆర్డర్లను సరిదిద్దుటకుగాని, రద్దుచేయుటకుగాని అధికారమును కలిగియుండును. శ్రీ వేమన గ్రంథాలయము

తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

ఆర్టికలు 61:

రాష్ట్రములయొక్క, కేంద్రప్రభుత్వ సరాసరి అధీనంలో ఉండే మునిసిపాలిటీలయొక్క, జిల్లాలయొక్క, విభాగింపబడిన మునిసిపాలిటీలయొక్క ప్రజా కాంగ్రెసుల ప్రతినిధులు వారిని ఎన్నుకొన్న సంస్థల అజమాయిషీకి లోబడి యుండవలెను.

భాగములుగా విభజింపబడని మునిసిపాలిటీలయొక్క, మునిసిపల్ జిల్లాలయొక్క, సియాంగులయొక్క, జాతుల సియాంగులయొక్క, పట్టణాలయొక్క ప్రజాకాంగ్రెసు ప్రతినిధులు వారి నియోజకవర్గ ప్రజల అజమాయిషీకి లోబడి యుందురు.

స్థానిక ప్రజాకాంగ్రెసు ప్రతినిధులను ఎన్నుకొన్న సంస్థలు, ఓటర్లు ప్రజాకాంగ్రెసులోని తమ ప్రతినిధులను ఎప్పుడైనా తొలగించుటకు, ఆ స్థానములను భర్తీచేయుటకు చట్ట ప్రకారం అధికారం కల్గియున్నవి.

ఆర్టికలు 62:

స్థానిక ప్రజాకౌన్సిళ్ళు, అనగా ప్రజాప్రభుత్వములు స్థానిక ప్రజాకాంగ్రెసులయొక్క కార్యనిర్వాహక శాఖలు. అవి రాజ్యాంగముయొక్క స్థానికపరిపాలక శాఖలు.

ఆర్టికలు 63:

రాష్ట్రాల, మునిసిపాలిటీల, జిల్లాల, సియాంగ్‌ల, పట్టణాల ప్రజాకౌన్సిళ్ళు అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు, సభ్యులతో ఏర్పడును. ప్రజాకౌన్సిళ్ళయొక్క పదవీకాలపరిమితి ఆయా ప్రజాకాంగ్రెసుల పదవీకాలపరిమితితో సమానము.

స్థానిక ప్రజాకౌన్సిలు నిర్మాణంగురించి చట్టంలో స్పష్టంగా విశదీకరించబడింది.

ఆర్టికలు 64:

ప్రతి స్థానిక ప్రజాకౌన్సిలు శాసనరీత్యా దానికి సంక్రమించిన అధికారపరిథిలో పరిపాలకభారము వహించును.

ప్రతి స్థానిక ప్రజాకౌన్సిలు ప్రజాకాంగ్రెసుయొక్క నిర్ణయాలను, అంతకంటె పై స్థాయిలలోగల పరిపాలకశాఖల యొక్క నిర్ణయాలను, ఆజ్ఞలను, సర్క్యులర్లను అమలు జరుపును.

శాసనరీత్యా తనకు సంక్రమించిన అధికారపరిమితిలో ప్రతి స్థానిక ప్రజాకౌన్సిలు నిర్ణయాలను ఆజ్ఞలను జారీచేయును.

ఆర్టికలు 65 :

జిల్లా, అంతకంటే పై స్థాయిలో గల ప్రజాకౌన్సిళ్ళు తమకు లోబడియున్న శాఖలయొక్కయు, తమకు అధీనంలో వున్న ప్రజాకౌన్సిళ్ళయొక్క విధులను నిర్దేశించును. ఇంకా చట్టప్రకారం పాలకోద్యోగులను నియమించును. తొలగించును.

జిల్లా, యింకా పై స్థాయిలోని ప్రజాకౌన్సిళ్ళు తమ అధీనంలోని ప్రజాకాంగ్రెసులయొక్క బేసబబయిన నిర్ణయాలను కొంతకాలముపాటు నిలుపుచేయును. తమకు లోబడిన శాఖలయొక్క, దిగువ స్థాయిలోని ప్రజాకౌన్సిళ్ళయొక్క బేసబబయిన నిర్ణయాలను సరిదిద్దును లేక రద్దుచేయును.

ఆర్టికలు 66 :

ప్రతిస్థాయిలోని స్థానిక ప్రజాకౌన్సిళ్ళు ఆయా స్థాయిలోని ప్రజాకాంగ్రెసులకు, యింకా ఉన్నత పరిపాలక శాఖలకు బాధ్యతవహించి నివేదికలు సమర్పించును.

దేశమంతటిలోని అన్ని స్థాయిలలోని ప్రజాకౌన్సిళ్ళు ప్రభుత్వమండలికి లోబడి దాని సమన్వయత్వం క్రింద పని చేయు పరిపాలక శాఖలు.

## అయిదో విభాగం

## స్వయం పరిపాలిత ప్రదేశములలో స్థానిక స్వయంపరిపాలక శాఖలు

ఆర్టికలు 67 :

స్వయం పరిపాలిత ప్రదేశములలోను, స్వయం పరిపాలిత 'చౌ'లలోను, స్వయంపరిపాలిత జిల్లాలలోను

పరిపాలక శాఖలు, రాజ్యాంగచట్టం రెండో ప్రకరణం 4 వ విభాగంలో వివరించినవిధంగా స్థానిక రాజ్యాంగాధికారపు శాఖల నిర్మాణంలో అనుసరించిన ప్రాథమికసూత్రాల ననుసరించి ఏర్పాటుచేయబడును.

ప్రతి స్వయం పరిపాలకశాఖయొక్క రూపం, ఆ స్వయం పరిపాలిత ప్రదేశంలోని స్వయం పరిపాలితాధికారము అనుభవించు అత్యధిక ప్రజల యిష్టానుసారం నిర్ణయించబడును.

ఆర్టికలు 68 :

అనేకజాతులు కలసి నివసించు స్వయంపరిపాలిత ప్రదేములలోను, స్వయంపారిపాలిత చౌలలోను, స్వయంపరిపాలిత జిల్లాలలోను ప్రతిజాతికి స్థానిక స్వయంపరిపాలక శాఖలో తగినంత ప్రాతినిధ్యం ఉండవలెను.

ఆర్టికలు 69 :

స్వయంపాలిత ప్రదేశములలోను, స్వయంపరిపాలిత చౌలలోను, స్వయంపరిపాలిత జిల్లాలలోను, స్వయంపరిపాలక శాఖలు రెండో ప్రకరణం 4 వ విభాగంలో చూపబడిన ప్రకారం రాజ్యాంగాధికారం అనుభవించు స్థానికశాఖల మాదిరిగా విధులను, అధికారములను నిర్వహించును.

ఆర్టికలు 70 :

అన్ని స్వయంపాలిత ప్రదేశములయొక్క, స్వయంపాలిత 'చౌ'ల యొక్క, స్వయం పాలిత జిల్లాలయొక్క స్వయంపాలక శాఖలన్నీ రాజ్యాంగచట్టం యింకా యితర శాసనాలకు కట్టుబడి తమకు సంక్రమించిన అధికార పరిమితిలో స్వయంపాలన సాగిం

అన్ని స్వయంపాలిత ప్రదేశములయొక్క, స్వయంపాలిత 'చౌ'ల యొక్క, స్వయంపాలిత జిల్లాలయొక్క స్వయంపాలక శాఖలు చట్టప్రకారం తమకు సంక్రమించిన అధికారములబట్టి తమ తమ ఆర్థిక వ్యవహారములను పరిపాలించును. అన్ని స్వయంపాలితప్రదేశముల, 'చౌ'ల, జిల్లాలయొక్క స్వయంపాలక శాఖలు రాజ్యాంగ సైనిక విధానంప్రకారం తమతమ రక్షణ బలాలను ఏర్పాటుచేసుకొనును.

అన్ని స్వయంపాలితప్రదేశములు; 'చౌ' ల జిల్లాల యొక్క స్వయంపాలకశాఖలు స్థానికజాతుల ప్రత్యేకరాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక అవసరాలదృష్ట్యా స్వయంపాలనను గురించి నిబంధనలు, రెగ్యులేషన్లు ఏర్పాటుచేసుకొని జాతీయ ప్రజా కాంగ్రెసు స్థాయీసంఘంవారి ఆమోదంకొరకు వానిని నివే దించును.

ఆర్టికలు 71 :

అన్ని స్వయంపాలితప్రదేశముల, 'చౌ'ల, జిల్లాల స్వయంపాలకశాఖలు తమపనులను నిర్వహించుటలో సాధార ణంగా ఆయా ప్రదేశములప్రజలు మాట్లాడే, వ్రాసే, భాష లేక భాషలను ఉపయోగించును.

ఆర్టికలు 72 :

ఉన్నతరాజ్యాంగ పాలకశాఖలు, స్వయంపాలితప్రదేశ, 'చౌ'ల, జిల్లాల, స్వయంపాలకశాఖలు, జాతీయ మైనారి టీలు తమతమ స్వయంపాలనసాగించుటకు రక్షణకల్పించి వాటి రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానికాభివృద్ధికి సాయపడవలయును.

# ఆరో విభాగం

## ప్రజాకోర్టులు : ప్రొక్యూరేటర్ ఆఫీసులు

ఆర్టికలు 73 :

చైనా ప్రజారిపబ్లికులోని సుప్రీం ప్రజాకోర్టు, ప్రతి స్థాయిలోని స్థానిక ప్రజాకోర్టులు, చట్టరీత్యా ఏర్పాటయిన స్పెషల్ కోర్టులు న్యాయపరిపాలనాధికారాన్ని నిర్వహిస్తాయి.

ఆర్టికలు 74 :

సుప్రీం ప్రజాకోర్టు అధ్యక్షునియొక్క, ప్రతి స్థాయిలోని స్థానిక ప్రజాకోర్టుల అధ్యక్షులయొక్క పదవీకాలపరిమితి నాల్గు సంవత్సరాలు. ప్రజాకోర్టుల నిర్మాణం చట్టంలో స్పష్టీకరించబడింది.

ఆర్టికలు 75 :

చట్టంలో ఆదేశించిన ప్రకారం ప్రతి స్థాయిలోని ప్రజాకోర్టులలో ప్రజాఅసెస్సర్ల విధానం అమలులోవుంటుంది.

ఆర్టికలు 76 :

చట్టం యితర విధంగా శాసిస్తే తప్ప, ప్రతిస్థాయిలోని ప్రజాకోర్టులలో కేసుల విచారణ బహిరంగంగా జరుగుతుంది. ముద్దాయికి డిఫెన్సు పెట్టుకొనే హక్కు వుంది.

(ముద్దాయి తన నిర్దోషిత్వం వాదించుకొని రుజువు చేసుకొనే హక్కువుంది.)

ఆర్టికలు 77 :

అన్ని జాతుల పౌరులు అన్ని కోర్టు విచారణలలోను తమ తమ ప్రాంతాలలో మాట్లాడే, లేక వ్రాసే భాషలను ఉపయో

గించుకొనుటకు హక్కు కల్గియున్నారు. ప్రజాకోర్టులు ఆయా ప్రదేశములలో వాడుకలోని భాషలను తెలియనివారికి అనువాద సౌకర్యం కల్గించాలి.

జాతుల మైనారిటీలు ఎక్కువగా నివసించే ప్రదేశాలలోను, అనేకజాతుల మైనారిటీలు ఒకచోట నివసించే ప్రదేశాలలోను, కోర్టు విచారణంతా ఆ ప్రదేశంలో సామాన్యంగా వాడుకలోవుండే భాషలో జరుగును. ప్రజాకోర్టులయొక్క జడ్జిమెంట్లు, సమన్లు, యితర దస్తావేజులు ఆ ప్రదేశంలో సామాన్యంగా వాడబడే భాషలో వ్రాతపూర్వకంగా ప్రకటించబడతవి.

ఆర్టికలు 78:

ప్రతి స్థాయిలోని ప్రజాకోర్టులు చట్టమునకు మాత్రము లోబడి స్వతంత్రంగా వ్యవహరించును.

ఆర్టికలు 79:

సుప్రీం ప్రజాకోర్టు అత్యున్నతమైన న్యాయ పరిపాలక శాఖ. సుప్రీం ప్రజాకోర్టు అన్ని స్థాయీలలోని స్థానిక ప్రజాకోర్టులయొక్క, స్పెషల్ కోర్టులయొక్క న్యాయ నిర్వహణ పనులను అజమాయిషీ చేయును.

పై స్థాయిలోని ప్రజాకోర్టులు, క్రింది స్థాయిలోని ప్రజాకోర్టుల న్యాయ నిర్వహణను అజమాయిషీ చేయును.

ఆర్టికలు 80:

సుప్రీం ప్రజాకోర్టు జాతీయ ప్రజాకాంగ్రెసుకు, అది సమావేశంలో లేనప్పుడు దాని స్థాయి సంఘమునకు బాధ్యత వహించి నివేదించును.

ప్రతి స్థాయిలోని స్థానిక ప్రజాకోర్టు ఆయా స్థాయిల్లోని స్థానిక ప్రజా కాంగ్రెసుకు బాధ్యతవహించి నివేదించును.

ఆర్టికలు 81:

చైనా ప్రజారిపబ్లికు యొక్క ప్రొక్యూరేటరు జనరల్ కార్యాలయం ప్రభుత్వమండలికి లోబడిన అన్ని శాఖలపైన, ప్రతిస్థాయిలోని పరిపాలక శాఖలపైన, రాజ్యాంగశాఖల ఉద్యోగులపైన, పౌరులపైన చట్టముల అతిక్రమణ జరుపకుండా అజమాయిషీ చేయును.

స్థానిక ప్రొక్యూరేటర్ల కార్యాలయములు, స్పెషల్ ప్రజాప్రొక్యూరేటర్ల కార్యాలయములు చట్టం అమోదించిన పరిమితిలో అజమాయిషీ అధికారమును చలాయించును.

స్థానిక ప్రొక్యూరేటరు కార్యాలయములు, స్పెషల్ ప్రొక్యూరేటరు కార్యాలయములు పై స్థాయిలోని ప్రొక్యూరేటరు కార్యాలయములకు లోబడి పనిచేయును. ప్రొక్యూరేటరు కార్యాలయములన్నీ ప్రొక్యూరేటరుజనరల్ కార్యాలయమునకు లోబడిపనిచేయును.

ఆర్టికలు 82:

ప్రొక్యూరేటరు జనరల్ యొక్క పదవీకాలపరిమితి నాల్గు సంవత్సరములు. ప్రొక్యూరేటరు కార్యాలయశాఖలు చట్టంలో ఆదేశించబడిన ప్రకారం నిర్మించబడును.

ఆర్టికలు 83:

ప్రతి స్థాయిలోని ప్రొక్యూరేటరు కార్యాలయపు స్థానిక శాఖలు, స్థానిక రాజ్యాంగాధికార శాఖలతో సంబంధం లేకుండా స్వాతంత్రంగా తమ అధికారం చలాయించును.

ఆర్టికలు 84:

ప్రొక్యూరేటరు జనరల్ కార్యాలయం జాతీయ ప్రజా కాంగ్రెసుకు, అది సమావేశంలో లేనప్పుడు, దాని స్థాయి సంఘమునకు బాధ్యతవహించును; నివేదించును.

## మూడో ప్రకరణం

# పౌరుల ప్రాథమిక హక్కులు: విధులు

ఆర్టికలు 85:

ప్రజా చైనా రిపబ్లికులోని పౌరులంతా చట్టరీత్యా సమాన హోదా కలిగివుంటారు.

ఆర్టికలు 86:

ప్రజాచైనా రిపబ్లికులో 18 సంవత్సరాల వయస్సు గలిగిన పౌరులంతా జాతి, వర్ణ, లింగ, వృత్తి, కుల, మత, ప్రసక్తితో సంబంధంలేకుండా విద్య, ఆస్థి, హోదాలతోను, నివాస కాలములతోను నిమిత్తం లేకుండా ఎన్నుకొనుటకు, ఎన్నుకోబడుటకు అధికారం కల్గియున్నారు. పిచ్చివాళ్ళు, చట్టం ప్రకారం ఎన్నికల్లో పాల్గొనేహక్కు కోల్పోయినవారు మాత్రం మినహాయించబడినారు. స్త్రీలు పురుషులతోపాటు ఎన్నుకొనుటకు, ఎన్నికవుటకు సమానహక్కులు కల్గియున్నారు.

ఆర్టికలు 87:

చైనా ప్రజారిపబ్లికు పౌరులందరికి వాక్, పత్రికా, సభాస్వాతంత్ర్యం, సంస్థలుగా ఏర్పడు స్వాతంత్ర్యం, ఊరేగింపు,

ప్రదర్శనా స్వాతంత్ర్యం కలిగియున్నారు. పౌరులు యీ స్వాతంత్ర్యములను అనుభవించుటకు అవసరమగు అవకాశములను రాజ్యాంగం గ్యారంటీ చేస్తుంది.

ఆర్టికలు 88:

చైనా ప్రజారిపబ్లికు పౌరులు మత స్వాతంత్ర్యం కలిగియున్నారు.

ఆర్టికలు 89:

చైనా ప్రజారిపబ్లికు పౌరుల వ్యక్తిస్వాతంత్ర్యం అనుల్లంఘనీయమైనది. (ఇన్వైయొలబుల్) ప్రజాకోర్టుయొక్క లేక ప్రజా ప్రాక్యూరేటరు కార్యాలయంయొక్క నిర్ణయముల రీత్యా తప్ప, ఏ పౌరుడున్నూ అరెస్టుచేయబడడు.

ఆర్టికలు 90:

చైనా ప్రజారిపబ్లికు పౌరుల గృహములు అతిక్రమించరానివి. పౌరుల ఉత్తరప్రత్యుత్తరాల రహస్యం చట్టరీత్యా రక్షింపబడినది.

చైనా ప్రజారిపబ్లికు పౌరులు నివాసస్వాతంత్ర్యం, నివాసము మార్చుకొనే స్వాతంత్ర్యం కలిగియున్నారు.

ఆర్టికలు 91:

చైనా ప్రజారిపబ్లికు పౌరులు పనిచేసుకొనేహక్కు కలిగియున్నారు. రాజ్యాంగం ప్రణాళికాబద్ధంగా జాతీయ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిపరుస్తూ, క్రమక్రమంగా ఉద్యోగావకాశములను కల్పిస్తూ, పనిలోని పరిస్థితులను బాగుచేస్తూ, నిజమైన వేతనాలను పెంచుతూ యీహక్కుకు గ్యారంటీ యిస్తుంది.

ఆర్టికలు 92:

చైనా ప్రజారిపబ్లికులోని శ్రమజీవులు విశ్రాంతిహక్కు కల్గియున్నారు.

శ్రమజీవు లీహక్కును అనుభవించేలాగు గ్యారంటీ యిచ్చుటకై, రాజ్యాంగం కార్మికులకు, ఆఫీసు ఉద్యోగులకు పనిగంటలు నిర్ణయించును; సెలవులను ఏర్పాటుచేయును;

శ్రమజీవులు విశ్రాంతిపొంది తమఆరోగ్యం బాగుచేసుకొనుటకై అవసరమైన భౌతికపరిస్థితులను క్రమంగా అభివృద్ధి చేస్తుంది.

ఆర్టికలు 93:

చైనా ప్రజా రిపబ్లికులోని శ్రమజీవులు వృద్ధాప్యంలోను, జబ్బుపడినప్పుడు, వికలాంగులైనప్పుడు అన్నివిధాల సాయంపొందే హక్కు కల్గియున్నారు. ఈ హక్కును శ్రమజీవులుఅనుభవించేందుకు రాజ్యాంగం సాంఘిక భీమా, సాంఘిక సాయం, ప్రజారోగ్య సదుపాయములు క్రమక్రమంగా పెంపొందించును.

ఆర్టికలు 94:

చైనా ప్రజా రిపబ్లికు పౌరులు విద్య నేర్చుకునేహక్కు కలిగియున్నారు. ఈహక్కు పౌరులు అనుభవించులాగు గ్యారంటీ చేయుటకు రాజ్యాంగం క్రమక్రమంగా వివిధాలయిన విద్యాశాలలను, వైజ్ఞానిక, విద్యాసంబంధమైన సంస్థలను స్థాపించి అభివృద్ధిచేయును. రాజ్యాంగం యువకుల శారీరక, మానసికాభివృద్ధికై ప్రత్యేకశ్రద్ధ తీసికొంటుంది.

ఆర్టికలు 95 :

చైనా ప్రజారిపబ్లికు శాస్త్రపరిశోధన, సాహిత్య, కళా సృష్టి, యింకా యితర సాంస్కృతిక రంగాలలో పౌరులకున్న స్వేచ్ఛను సంరక్షిస్తుంది. రాజ్యాంగం వైజ్ఞానిక, విద్యావిషయిక, సాహిత్య, కళా, తదితర సాంస్కృతికరంగాల్లో కృషిచేసే పౌరులను వారి సృజనాత్మక కృషిలో ప్రోత్సాహపరచి సాయ పడుతుంది.

ఆర్టికలు 96 :

చైనా ప్రజారిపబ్లికులో స్త్రీలు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక, గృహ రంగాలలో పురుషులతో పాటు సమాన హక్కులు అనుభవింతురు. రాజ్యాంగం వివాహాన్ని, కుటుంబాన్ని, తల్లిని, బిడ్డను రక్షించుచుంది.

ఆర్టికలు 97 :

చైనా ప్రజారిపబ్లికు పౌరులు ఏ స్థాయిలోని రాజ్యాంగ శాఖకయినా ప్రభుత్వోద్యోగులు తమవిధిని నిర్వహించలేదని గాని, చట్టం అతిక్రమించారనిగాని, మూజువాణీగాగాని, వ్రాత మూలకంగాగాని నేరారోపణ చేయుహక్కు కల్గియున్నారు.

ప్రభుత్వోద్యోగులవల్ల హక్కులు అతిక్రమించబడి నష్టం పొందు పౌరులు నష్టపరిహారముపొందుటకు హక్కు కల్గి యున్నారు.

ఆర్టికలు 98 :

చైనా ప్రజారిపబ్లికు విదేశాలలో నివసించే చైనీయుల న్యాయమైన హక్కులను, ప్రయోజనాలను రక్షిస్తుంది.

ఆర్టికలు 99:

చైనా ప్రజారిపబ్లికు వైజ్ఞానిక రంగాలలోగాని, శాంతి ఉద్యమంలోగాని, ఇంకా యితర న్యాయమైన ఆశయముల సమర్థించినందుకు బాధించబడు ఏవిదేశస్థునికైనా ఆశ్రయం యిస్తుంది.

ఆర్టికల్ 100:

చైనా ప్రజారిపబ్లికు పౌరులు రాజ్యాంగచట్టానికి యితర చట్టాలకు విధేయులై యుండవలెను. పనిలో క్రమశిక్షణను, ప్రజాశాంతిని రక్షించవలెను. సాంఘికనీతిని గౌరవించవలెను.

ఆర్టికలు 101:

చైనా ప్రజారిపబ్లికులో ప్రభుత్వాస్తి పవిత్రమైనదిన్నీ, అతిక్రమించరానిదిన్నీ అయి యున్నది.

ఆర్టికలు 102:

చైనా ప్రజారిపబ్లికు పౌరులందరు చట్టప్రకారం పన్నులను చెల్లించుట విధియైయున్నది.

ఆర్టికలు 103:

మాతృదేశమును రక్షించుట చైనా ప్రజారిపబ్లికులోని ప్రతిపౌరుని పవిత్రమైన విధి.

చైనా ప్రజారిపబ్లికు పౌరులందరికి చట్టంప్రకారం సైన్యంలో పనిచేయుట గౌరవప్రదమైన విధి.

# నాలుగో ప్రకరణం

# జాతీయ పతాకం : రాజ్యాంగ చిహ్నం : రాజధాని

ఆర్టికలు 104 :

చైనా ప్రజారిపబ్లికు జాతీయపతాకం అయిదు నక్షత్రములుగల ఎఱ్ఱనిజండా.

ఆర్టికలు 105 :

చైనా ప్రజారిపబ్లికు రాజ్యాంగ చిహ్నం: మధ్యలో అయిదు నక్షత్రముల ప్రకాశంలో టీన్-ఎన్-మెన్ (స్వర్గ శాంతి ద్వారం); చుట్టూ ధాన్యపు కంకులతో చట్రం, పళ్ళ చక్రంపై ఆధారపడియుండును.

ఆర్టికలు 106 :

చైనా ప్రజా రిపబ్లికు రాజధాని పెకింగు నగరం.





చైనా జాతీయ ప్రజా కాంగ్రెస్ స్థాయిసంఘ అధ్యక్షుడు

లీ షావ్ - చీ



చిత్తు రాజ్యాంగచట్టాన్ని చర్చిస్తున్న వ్యవసాయ వుత్పత్తిదారుల సహకార సంఘ సభ్యులు.



చిత్తు రాజ్యాంగచట్టాన్ని చర్చిస్తున్న బౌద్ధ, తావ్ మతస్థులు.



జాతీయ మైనారిటీలకు చెందినవారు
చిత్తు రాజ్యాంగచట్టాన్ని చదువుతున్నారు.



పెకింగ్ విశ్వవిద్యాలయ విద్యార్థులు చిత్తు రాజ్యాంగచట్టాన్ని చర్చిస్తున్నారు.

౫౩

సుదీర్ఘ చర్చల తర్వాత ఇటీవల చైనా జాతీయ ప్రజా సభ చైనా రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించింది. ప్రజా ప్రతినిధులు రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించకముందు రాజ్యాంగ చట్ట ముసాయిదాపై, ముసాయిదా రచన సంఘం సభ్యుడు, చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రధానకార్యదర్శి అయిన కామ్రేడ్ లీ-షావ్-చీ పెకింగ్‌లో సెప్టెంబరు 25న సమావేశమయిన ప్రథమ జాతీయ ప్రజాసభ ప్రథమ సమావేశంముందు ఇచ్చిన నివేదిక పూర్తిపాఠం ఇది:

సోదర ప్రజా ప్రతినిధులారా!

చైనా ప్రజా రిపబ్లిక్ రాజ్యాంగ రచన, ఆమోదం, మన దేశ రాజకీయ జీవితంలో గొప్ప చారిత్రక ప్రాముఖ్యంగల సంఘటన. ప్రథమ జాతీయ ప్రజాసభ ప్రథమ సమావేశం నిర్వహించే అతిముఖ్య కర్తవ్యం మన దేశ రాజ్యాంగచట్టాన్ని ఆమోదించడమే.

ఇప్పుడు మీకు సమర్పించుతున్న రాజ్యాంగచట్ట ముసాయిదా, తీవ్రమైన కృషి ఫలితంగా రూపొందింది.

చైనా ప్రజా రిపబ్లిక్ రాజ్యాంగచట్ట రచనా సంఘం కామ్రేడ్ మావ్-సే-టుంగ్ ఆధ్వర్యాన 1953 జనవరి 13న కేంద్ర ప్రజాప్రభుత్వ కౌన్సిల్‌చే ఏర్పరచబడింది. 1954 మార్చిలో చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సమర్పించిన రాజ్యాంగచట్ట ప్రథమ ముసాయిదాను ఈ సంఘం ఆమోదిం

చింది. తర్వాత దానిపై పెకింగ్‌లోను, ఇతరప్రధాన నగరాల లోను కూలంకషమైన చర్చలు ఏర్పాటుచేయబడ్డాయి. రెండు నెలలకుపైగా జరిగిన ఈ చర్చలలో వివిధ ప్రజాతంత్ర పార్టీలకు, గ్రూపులకు, ప్రజాసంస్థలకు, సంఘంలో అన్ని తరగతుల ప్రజలకు ప్రాతినిధ్యం వహించే 8000 మందికి పైగా పాల్గొన్నారు.

దీని అర్థం ఏమిటంటే ఈ 8000 మందీ రాజ్యాంగ రచనలో పాల్గొన్నారన్నమాట. దీనిఫలితంగా, పైనపేర్కొన్న ముసాయిదాలో మార్పులు చేయగా వెలువడిన యీ కొత్త ముసాయిదాను కేంద్ర ప్రజాప్రభుత్వ కౌన్సిల్ 1954 జూన్ 14న దేశమంతటా ప్రజలందరూ తిరిగి చర్చలలో పాల్గొనుటకు గాను విడుదలచేసింది. ఈ చర్చలు రెండు నెలలకుపైగా జరిగాయి. 15 కోట్లకుపైగా ప్రజలు చర్చలలో పాల్గొన్నారు. బహుళ ప్రజానీకం ముసాయిదా రాజ్యాంగచట్టంయెడల తమ ఆమోదాన్ని తెలిపారు. అదేసమయంలో, ముసాయిదా సవరణకు, మార్పులకు అనేక సూచనలుచేశారు. ఈ సూచనల దృష్ట్యా రాజ్యాంగచట్ట రచనాసంఘం ముసాయిదాలో మరి కొన్ని మార్పులుచేసింది. ఈమార్పులను కేంద్ర ప్రజాప్రభుత్వ కౌన్సిల్ 1954 సెప్టెంబరు 9న చర్చించి అంగీకరించింది. ఆ విధంగా యిప్పుడు యీ ముసాయిదా యీసభముందు పెట్టబడింది.

చైనా ప్రజా రిపబ్లిక్ రాజ్యాంగచట్ట ముసాయిదాపై యీ సభకు రాజ్యాంగరచనాసంఘం తరఫున నేనీ నివేదికను సమర్పిస్తున్నాను.

రాజ్యాంగచట్ట రచనలో మేము వాస్తవపరిస్థితులను ఆధారం చేసుకున్నాము. అయితే ఆ పరిస్థితులేమిటి? అవి: సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, బురాక్రటిక్ పెట్టుబడిదారీ విధానాలపై సుదీర్ఘ విప్లవపోరాటం జరిపి, చైనా ప్రజలమైన మనం పరిపూర్ణవిజయం సాధించాం; కార్మికవర్గ నాయకత్వాన, కార్మిక కర్షక ఐక్యతపై ఆధారపడి, మన నూతన ప్రజాస్వామ్యరాజ్యం సుస్థిరంగా నెలకొన్నది; చైనా ఆర్థిక వ్యవస్థలో సోషలిస్టురంగం, ఇప్పుడు నాయకత్వస్థానాన్ని సంపాదించింది; మన దేశం క్రమబద్ధమైన సోషలిస్టు నిర్మాణాన్ని ప్రారంభించింది; క్రమంగా సోషలిస్టు సమాజంవైపు పరివర్తనం చెందుతున్నది.

ఈ విషయాలనుంచి మనం తెలుసుకొనేదేమిటి? మన రాజ్యాంగ చట్టం నూతన ప్రజాతంత్ర రాజ్యాంగచట్టం తప్ప మరొకటి కానేరదు. అది సోషలిస్టు పద్ధతికి చెందిన రాజ్యాంగ చట్టం; బూర్జువా పద్ధతికి చెందినది కాదు.

చైనా ప్రజలు వంద సంవత్సరాలకుపైగా సాగించిన వీరోచిత పోరాటాల చారిత్రక అనుభవం యొక్క సారమే ఇప్పుడు మేము సమర్పించుతున్న యీ రాజ్యాంగచట్ట ముసాయిదా. అంతేకాదు; రాజ్యాంగచట్ట సమస్యమీద, ఆధునిక చైనాలో రాజ్యాంగ ఉద్యమం మీద చారిత్రక అనుభవానికి కూడ ఇది సారమే.

చైనా ప్రజలు దీర్ఘకాలం సామ్రాజ్యవాద, ఫ్యూడలిస్టు ముష్కరపాలనక్రింద జీవించారు. వంద సంవత్సరాలక్రితం విదేశీపెట్టుబడిదారీ విధానం చైనాపై దాడిప్రారంభించింది. ఆ

ఆ సమయంలో చైనాఫ్యూడల్ పాలకులు తమదేశరక్షణలో పూర్తిగా అసమర్థులని రుజువు చేసుకున్నారు. వెలపలనుంచి దురాక్రమణ, దోపిడీ తీవ్రమయ్యేకొద్దీ, దేశీయ రాజకీయాలు మరింత నిరంకుశంగా తయారైనాయి. అప్పటినుంచి చైనా గొప్ప జాతియైనప్పటికీ విదేశ వ్యవహారాల్లో స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయింది. చైనా జనసామాన్యం చెప్పనలవికాని బాధలకు గురియైనారు. అయితే ఈ సమయంలోనే, విదేశీపెట్టుబడిదారీ విధానానికీ, దేశీయఫ్యూడల్‌విధానానికి వ్యతిరేకంగా చైనా ప్రజలు వీరోచిత విప్లవపోరాటం ప్రారంభించారు. చైనాను కాపాడటానికి, దాని భవితవ్యాన్ని తీర్చిదిద్దడానికి, పలువురు విజ్ఞానవంతులు సత్యాన్వేషణకు ఉపక్రమించారు. పాశ్చాత్య బూర్జువా విధానాలు చైనాను రక్షిస్తాయనే ఉద్దేశ్యంతో, వీరు పాశ్చాత్య బూర్జువా రాజకీయాలను, సంస్కృతిని అధ్యయనం చేయడానికి గట్టి కృషిసాగించారు. అటు తర్వాత వారు మన దేశ ప్రభుత్వ వ్యవస్థను, సాంఘికవిధానాన్ని పాశ్చాత్య పెట్టుబడిదారీదేశాల పద్ధతుల ననుసరించి రూపొందించ యత్నించారు.

1894లో చైనా జపాన్‌చేత ఓడించబడిన తర్వాత, ప్రారంభమైన సంస్కరణోద్యమం పై ప్రయత్నములలో ఒకటి. కాంగ్‌యూ-వీ నాయకత్వాన ఒక సంస్కరణవాదుల గ్రూపు దీనిని నడిపించింది. చైనా ఫ్యూడల్‌పద్ధతి సమూలంగా మారకుండగనే, పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందడానికి అవకాశమిచ్చే రాజ్యాంగచట్టాన్ని వీరు కోరారు. ఆనాడు వారిసూత్రాలను అనేకమంది ఆమోదించారు. వారు సంస్కరణవాదు

లైనప్పటికీ, ఆకాలపుపరిస్థితిని దృష్టిలోవుంచుకుంటే వారిసంస్కర ణోద్యమం అభ్యుదయకరమైనదే. అందుచేతనే, అభివృద్ధి నిరోధకముతా శత్రుత్వాన్ని ఆ వుద్యమం ఎదుర్కోవలసి వచ్చింది. సీ-హాసీ మహారాణి ఆధ్వర్యాన అభివృద్ధి నిరోధక ముతా సాగించిన నిర్బంధవిధానం ఫలితంగా 1898 లో వారి కార్యకలాపాలు ఆగిపోయాయి.

1894 లో జపాన్‌చేత చైనా ఓటమి విశాలమైన ప్రజా వుద్యమాన్ని లేవదీసింది. కాంగ్‌యూ-లీ గ్రూపువారి సంస్కర ణోద్యమంతోపాటు, ఇతర విప్లవ గ్రూపులవారి ఉద్యమంకూడ ప్రారంభమైంది. వీటిలో ఒకదానికి సన్‌యట్-సేన్ నాయకుడు. కాంగ్‌యూ-లీగ్రూపు కృషిపై ఫల్యంచెందిన తర్వాత 1905లో వీరు "టాంగ్‌మెంగ్ హుయీ" (విప్లవ సమితి)ని నెలకొల్పారు. అయితే, సంస్కరణవాదులవలెగాక, వీరు బూర్జువా ప్రజా తంత్ర రిపబ్లిక్‌ను స్థాపించాలని అభిలషించారు. మంచూ పాలనను కూలద్రోయడానికి విప్లవసమరం జరిపారు. అంతవరకు వారు సంస్కరణవాదులకన్నా ఒక పెద్దఅడుగు ముందుకు వేశారు.

విప్లవశక్తులు త్వరితంగా విస్తృతంచెందుతున్న పరిస్థితిలో మంచూపాలన నిలవడంకష్టసాధ్యమయింది. అయితే తమ అధికారాన్ని నిలుపుకోడానికి ప్రజలను వంచించి విప్లవాన్ని త్రుంచివేయడానికి, 50 సంవత్సరాల క్రితం ఈ మంచూ పాల కులు "రాజ్యాంగ విధానానికి సన్నాహకాలం" అంటూ ఒక ప్రకటనచేసి, 1908 లో "రాజ్యాంగచట్ట సూత్రాలను" జారీ చేశారు. ఈ రాజ్యాంగచట్ట సూత్రాలు ప్రజల కోర్కెలను

కొన్నింటిని అంగీకరిస్తున్నట్లు కనబడినప్పటికీ, ప్రధానలక్ష్యం, ఫ్యూడల్ నిరంకుశ పాలనను రక్షించడమే. అయితే ప్రజలు ఈ వాగ్దానాలను విశ్వసించలేదు. ఇలాంటి "రాజ్యాంగచట్టం" తమ దేశపరిస్థితులను బాగుపరుస్తుందనీ నమ్మలేదు. అసలు ఈ దగాకోరు "రాజ్యాంగాన్నే" వారు త్రోసిపుచ్చారు. సన్ యట్-సేన్ నాయకత్వానగల విప్లవకారులు దీనిని ఖచ్చితంగా వ్యతిరేకించగా, కాంగ్ యూ - లీ నాయకత్వానగల సంస్కరణవాదులు దానిని బలపరచారు. తత్ఫలితంగా, వీరు విప్లవకారుల వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చింది. ప్రజలు వీరిని త్రోసివేశారు.

సన్ యట్-సేన్ నాయకత్వానగల విప్లవవర్గం. విప్లవం ద్వారా, బూర్జువా పద్ధతికి చెందిన ప్రజాతంత్ర రాజ్యాంగాన్ని సాధించాలని గాఢంగా కోరారు. ఆ కాలపు చారిత్రక పరిస్థితులను దృష్టిలో వుంచుకుంటే, వారా వైఖరి అవలంబించడం, అది బహుళ ప్రజాసామాన్యపు కోర్కెనుకూడ ప్రతిబింబించింది కాబట్టి సరియైనదే. వారి నాయకత్వం క్రిందనే అత్యంత చారిత్రక ప్రాధాన్యతగల 1911 విప్లవం జరిగింది.

1911 విప్లవం మంచూవంశం పాలనను కూలద్రోసింది. 2 వేల సంవత్సరాలకు పైగా వేళ్లుపాతుకున్న చైనా ఫ్యూడల్ రాచరికానికి స్వస్తిచెప్పింది. చైనా రిపబ్లిక్ ను, సన్ యట్-సేన్ నాయకత్వాన నాన్ కింగ్ లో తాత్కాలిక విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించింది. బూర్జువా రిపబ్లిక్ రాజ్యాంగ స్వరూపంగల "తాత్కాలిక రాజ్యాంగచట్టాన్ని" తీసుకవచ్చింది. ఈ రాజ్యాంగం అభ్యుదయకర స్వభావంకలది కూడా. ఈ విప్లవం ప్రజాతంత్ర

రిపబ్లిక్ భావాన్ని ప్రజల మనస్సులలో నాటింది. దీనికి వ్యతిరేక మైన ఏ అభిప్రాయానికి స్థానం లేదని ప్రజలు గుర్తించేట్టు చేసింది. అయితే అప్పట్లో విప్లవకారులలో కొన్ని లోట్లు వున్నవి. వారికి సమగ్రమైన సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక కార్యక్రమం లేదు. తమకు అండగావుండేట్లు బహుళ ప్రజా శక్తులను వారు సమీకరించనూ లేదు. అందుచేత, సామ్రాజ్య వాదం పైనా, ఫ్యూడలిజం పైనా వారు పూర్తి విజయాన్ని సాధించలేకపోయారు. ఆఖరికి విప్లవం విఫలమైంది. యువాన్ షీ-కై నాయకత్వాన అభివృద్ధినిరోధకులు అధికారం హస్తగతం చేసుకున్నారు. అప్పటినుంచీ, పేయాంగ్ యుద్ధప్రభువుల ముఠాలు చైనాపై పెత్తనం వహించడం ప్రారంభించాయి. తాత్కాలిక రాజ్యాంగచట్టం తునాతునకలైపోయింది. "చైనా రిపబ్లిక్" పేరుకు మాత్రమే నిలిచింది. సన్‌యట్-సేన్ నాయ కత్వాన విప్లవకారులు పేయాంగ్ యుద్ధప్రభువుల ప్రభుత్వంపై పోరాటం సాగిస్తూనే వచ్చారు. కాని, ఫలితమేమీ దక్కలేదు.

పేయాంగ్ ప్రభువులపాలనలో చైనాలోపరిస్థితి నానాటికి విషమించింది. ప్రపంచంలోని ప్రధాన సామ్రాజ్యవాద దేశాలన్నీ చైనాలో దొరికినంతమట్టుకు ఏరుకోవడం ప్రారంభించాయి. సామ్రాజ్యవాద యజమానుల మద్దతుతో ఈ యుద్ధప్రభువుల మఠాల మధ్య అంతర్యుద్ధాలు ఏళ్ళతరబడీ సాగాయి. ఎక్కడ చూచినా గందరగోళం ఏర్పడింది. ఒకరి తర్వాత మరొకరు ఈ యుద్ధప్రభువులముఠాలు పెకింగ్‌లో అధికారాన్ని స్వాధీనం చేసు కొనసాగాయి. ఈ అధికారాన్ని అట్టిపెట్టడానికి నామ

మాత్రంగా అధ్యక్షుడుగావున్న త్సావోకున్ 1923 లో ఒక బూటకపు "రాజ్యాంగంచట్టాన్ని" జారీచేయగా, ప్రజలు వెంటనే దానిని నిరాకరించారు. సన్‌యట్-సేన్ నాయకత్వాన కుమింగ్‌టాంగ్, చైనా కమ్యూనిస్టుపార్టీలు ఈ రాజ్యాంగాన్ని వ్యతిరేకించి, దానిని ఒక దగాగా పేర్కొన్నాయి. ఈబూటకపు రాజ్యాంగాన్ని జారీచేసిన ఒక సంవత్సరానికే త్సావోకున్ ప్రభుత్వం పడిపోయింది.

1911 విప్లవానికి ముందూ, వెనుక కొన్ని సంవత్సరాలపాటు చైనాను కాపాడదలచిన వారందరూ పెట్టుబడిదారీ పద్ధతులపైనే పరిష్కారాన్ని సాధించడానికి ప్రయత్నించారు. మొదటి ప్రపంచయుద్ధం తర్వాత, రష్యాలో అక్టోబరు సోషలిస్టు విప్లవం తర్వాత మాత్రమే, పాశ్చాత్య పెట్టుబడిదారీ విధాన క్రమపతనాన్ని, సోషలిస్టు భానోదయాన్ని చైనా ప్రజలు పరికించ నారంభించారు. 1919 మే 4 న సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా చైనాలో గొప్ప విప్లవోద్యమం ప్రారంభమైంది. కార్మికోద్యమం ముందుకురాసాగింది. పెట్టుబడిదారీ విధానంకంటె సోషలిజమే చైనా సమస్యలను పరిష్కరించగలదని చైనా ప్రజలలో చైతన్యంగలవారికి గట్టి నమ్మకం కుదిరింది.

ఈ దృఢమైన అభిప్రాయాన్ని ప్రజాసామాన్యం త్వరలోనే ఆమోదించారు. 1921లో చైనా కార్మికవర్గ మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీ - చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. ఆవిధంగా చైనా విప్లవంలో నూతన పరిస్థితి ఏర్పడింది. అప్పటి నుంచి, చైనా విప్లవం కార్మికవర్గం నాయకత్వంవహించే,

నూతన ప్రజాతంత్ర విప్లవంగా తయారయింది. ఈ నూతన ప్రజాతంత్ర విప్లవం ప్రపంచ సోషలిస్టు విప్లవంలో అంతర్భాగమై, సోషలిస్టు సోవియట్ యూనియన్ సహాయాన్ని పొందగలిగింది.

చైనాను రక్షించడానికి, "ప్రజలను చైతన్యవంతులను చేయాలని, మనలను సమాన ప్రాతిపదికపై గౌరవించే ప్రపంచ ప్రజలతో కలిసి ఉమ్మడి పోరాటం సాగించాలని" గొప్ప విప్లవకారుడైన సన్‌యట్-సేన్ తన దీర్ఘకాల పోరాటానుభవం ద్వారా గ్రహించాడు. తత్ఫలితంగా, సోవియట్ యూనియన్‌తో కలవడం, కమ్యూనిస్టుపార్టీతో చేతులుకలపడం, కార్మిక కర్షకులకు సహాయం యివ్వడం అనే త్రైసూత్ర కార్యక్రమాన్ని ఆయన అనుసరించాడు. ఆయన కొమింగ్‌టాంగ్‌ను పునర్నిర్మించాడు; సామ్రాజ్యవాదానికి, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా పోరాడటానికి కమ్యూనిస్టుపార్టీతో ఐక్యతను ఏర్పరచుకొన్నాడు. ఆ విధంగా విప్లవ పోరాటంలో నూతనదశ ప్రారంభమైంది.

1927 లో కుమింటాంగ్ కమ్యూనిస్టుపార్టీలు సంయుక్తంగా సాగించిన ఉత్తర ప్రాంతీయ విప్లవపోరాటం విజయ సాధనకు పురోగమిస్తూవున్న సమయంలో, చాంగ్-కై-షేక్ పెత్తనంలోని కుమింటాంగ్‌వర్గం సన్‌యట్-సేన్ విధానాన్ని కాలదన్ని, విప్లవానికి ద్రోహంచేసింది. అప్పటినుంచి చైనా విప్లవాన్ని నడిపించే బాధ్యతను చైనా కార్మికవర్గం, ఆ వర్గం పార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ పూర్తిగా స్వీకరించాయి. అటు తర్వాత, చైనా విప్లవం ఇదివరకటి విప్లవోద్యమాలలో

కనివిని ఎరుగని లోతును, సమగ్రతను, ప్రజాస్థాయిని ప్రదర్శిం చింది. వ్యవసాయ విప్లవ సమరంలోను, జపాన్ దురాక్రమణ ప్రతిఘటనా పోరాటంలోను, ప్రజావిముక్తి యుద్ధంలోను, చైనా ప్రజలు క్రమంగా బలవత్తరమైన సాయుధ బలాలను నిర్మించుకొని, విశాలమైన విప్లవస్థావరాలను ఏర్పరచుకొని, ఐక్యసంఘటనపై ఆధారపడిన ప్రజాతంత్రాధికారాన్ని స్థాపించి, వివిధ సాంఘిక సంస్కరణలను అమలుజరిపారు. అపారంగా విప్లవానుభవాన్ని సంపాదించుకొన్నారు.

నూతన ప్రజాస్వామ్యంనుంచి సోషలిజానికి చైనా కమ్యూనిస్టుపార్టీ సూచించిన మార్గమొక్కటే చైనాకు విముక్తి కలిగించుతుందని, ఏళ్ళతరబడి సాగిన విప్లవపోరాటాలు రుజువు చేస్తున్నాయి. ఈ మార్గం యావన్మంది ప్రజల గౌరవాన్ని చూరగొన్నది. రెండవ ప్రపంచయుద్ధం తర్వాత, అమెరికా సామ్రాజ్యవాదం మద్దతుతో నిలబడ్డ అభివృద్ధినిరోధక చాంగ్ కై షేక్ ముఠాను చైనా ప్రజలు పూర్తిగా ఓడించివేశారు. 1949లో ప్రజావిప్లవానికి బ్రహ్మాండమైన విజయం సాధించారు.

గతంలో చైనాను పాలించిన అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలలో చాంగ్-కై-షేక్ నాయకత్వాన గల కొమింటాంగ్ ప్రభుత్వం ఆఖరుది. ఆ ప్రభుత్వం ఎన్నడూ రాజ్యాంగచట్టాన్ని కోరలేదు. అయితే అది కూడా అంతిమఘడియలు ఆసన్నమైనపుడు ఒక బూటకపు ప్రజారాజ్యాంగచట్ట సహాయంతో బ్రతకచూసింది. ఈ రాజ్యాంగచట్టాన్ని చైనాకమ్యూనిస్టుపార్టీ, వివిధ ప్రజాతంత్ర పార్టీలు, చైనా ప్రజలు యావన్మందీ ప్రతిఘటించారు. గతంలో యితర అభివృద్ధి నిరోధక ప్రభుత్వాల

వలెనే చాంగ్-కై-షేక్ ప్రభుత్వం కూడా రాజ్యాంగ చట్టం అమలుపరచిన తర్వాత మూడేళ్ళయినా తిరగకముందే కూలిపోయింది. ఈలోగా, ఈ బూటకపు రాజ్యాంగాన్ని బలపరచిన యంగ్ చైనాపార్టీ, నేషనల్ సోషలిస్టుపార్టీ, ఇతర విప్లవ ప్రతీఘాతకపార్టీలు, గ్రూపులు ప్రజలచే తిరస్కరించబడినాయి. ఈ విషయం ఇక్కడున్న ప్రతినిధుల స్మృతిపథాల్లో యింకా మెరుస్తూనే వుందనుకుంటాను.

గత వందసంవత్సరాలలో చైనాలో విప్లవశక్తులకు, విప్లవ ప్రతీఘాతక శక్తులకూ మధ్య పోరాటం ఒక్కదినమైనా తెరపిలేకుండా నిరంతరం సాగుతూ వచ్చింది. ప్రభుత్వ వ్యవస్థ స్వరూపంపై ఈ అతితీవ్ర పోరాటంలో మూడు విభిన్నశక్తులు మూడు విభిన్న రాజ్యాంగచట్టాలను అభిలషించాయి.

మొదటిది : మంచూపాలకులు, పీయాంగ్ యుద్ధ ప్రభువులు, చాంగ్‌కైషేక్ కుమింగ్‌టాంగ్‌లు గూడుపుఠాణీ చేసిన బూటకపు రాజ్యాంగ చట్టాలు. ఫ్యూడల్, వాణిజ్యపెట్టుబడి వర్గాలకు చెందిన ఈ అభివృద్ధి నిరోధకపాలకులు బూర్జువా ప్రజాస్వామ్యానికి సైతం వ్యతిరేకులే. అసలు వీరెన్నడూ ఏ రాజ్యాంగ చట్టాన్నీ కోరలేదు. అందుచేత, విప్లవ శక్తుల ఒత్తిడికి వారి అభివృద్ధి నిరోధక పాలన కూలిపోతున్నపుడు, తమ అంతిమ ఘడియలు సమీపించినపుడు మాత్రమే వారు త్వరత్వరగా బూటకపు "రాజ్యాంగ చట్టాలను" సృష్టించారు. ఆ విధంగా బూర్జువా రాజ్యాంగచట్టం ముసుగుతో, మరణశయ్యపైవున్న తమ అభివృద్ధి నిరోధక పాలనను కొంతకాలం

వరకైనా నిలబెట్టుకోగలమని ఆశించారు. సహజంగానే వారు విఫలులయ్యారు.

రెండవది: చైనా జాతీయబూర్జువావర్గం గతంలో ఎంతోకాలంగా వాంఛిస్తూ వచ్చిన బూర్జువా ప్రజాతంత్ర రిపబ్లిక్ యొక్క రాజ్యాంగచట్టం 1911 విప్లవఫలితంగా ఏర్పడి వెన్వెంటనే యువాన్-షి-కై చేత రద్దుచేయబడిన రాజ్యాంగ చట్టం ఆ తరగతికి చెందినదే. చైనాచరిత్రలో అలాంటి రాజ్యాంగంచట్టం అదొక్కటే.

ఫ్యూడలిజాన్ని నిర్మూలించిన తర్వాత ప్రపంచంలో అనేకరాజ్యాలు బూర్జువా రిపబ్లిక్కులను నెలకొల్పినప్పటికీ, అర్థవలస, అర్థఫ్యూడల్ చైనాలో ఇలాంటి బూర్జువారిపబ్లిక్ ఒట్టి ఊహాజనితం మాత్రమే. కారణమేమంటే, విదేశసామ్రాజ్య వాద, దేశీయ అభివృద్ధినిరోధక సంయుక్తబలగాలను ఓడించ డానికి ప్రజలకు నాయకత్వం వహించడంలో చైనా బూర్జువా వర్గం అసమర్థమైనందున, అది చైనాను బూర్జువా రిపబ్లిక్ గా మార్చలేకపోయింది. అందుచేత, చైనాలో బూర్జువారాజ్యాం గాన్ని స్థాపించలేకపోయింది.

మూడవది: కార్మికవర్గ నాయకత్వాన, కార్మిక కర్షక ఐక్యతపైన ఆధారపడిన ప్రజారిపబ్లిక్ రాజ్యాంగం. అదే మనం ఇపుడు చట్టంచేయబోతున్న రాజ్యాంగం.

కార్మికవర్గ నాయకత్వాన ప్రజావిప్లవం విజయవంత మైన తర్వాత స్థాపించబడే రిపబ్లిక్ బూర్జువా నియంతృత్వం కాబోదని, కార్మికవర్గ నాయకత్వాన, కార్మిక కర్షక ఐక్యతపై ఆధారపడిన నూతన ప్రజాతంత్ర నియంతృత్వం ఏర్పడుతుందని,

కా|మేడ్ మావ్-సే-టుంగ్ చాలకాలం క్రిందటే స్పష్టం చేశాడు. కార్మికవర్గ నాయకత్వాన ఈ ప్రజారిపబ్లిక్ చైనాను సోషలిజం వైపు నడిపిస్తుందేగాని పెట్టుబడిదారీ విధానం వైపు కాదు.

అసలు వాస్తవం ఇది: అనేక సందర్భాలలో ఫ్యూడల్ గుత్తదారీ వర్గానికి చెందిన అభివృద్ధి నిరోధక పాలకముఠాలు తయారుచేసిన బూటకపు రాజ్యాంగచట్టాలు ప్రజలను వంచించ లేకపోయాయి. ప్రజలు వాటిని తిరస్కరించారు. ఈ రాజ్యాంగచట్టాల రచనలో చేయి చేసుకున్నవారినీ, వాటిని బలపరచిన వారినీ ప్రజలు త్రోసిపుచ్చారు. నిజానికి తమ తమ బూటకపు రాజ్యాంగచట్టాలను జారీచేసిన వెన్వెంటనే యీ అభివృద్ధి నిరోధకపాలకులు కూలిపోయారు. వారి "రాజ్యాంగ చట్టాలు" ఒట్టి చిత్తుకాగితాలుగా మారిపోయాయి. అంతే గాక' అనేక సంవత్సరాలుగా, విభిన్నధోరణులకు చెందిన వారు బూర్జువారాజ్యాంగాన్ని అమలుపరచడానికి అన్నివిధాలా కృషిచేసినప్పటికీ జరిగినదేమీ లేదు. చైనాకు సరియైన రాజ్యాంగచట్టం వుండాలంటే, నూతన ప్రజాతంత్ర సోషలిస్టు రాజ్యాంగచట్టమే అలాంటిది కాగలదు. అట్టి రాజ్యాంగచట్టం అత్యధికసంఖ్యాక ప్రజల ప్రయోజనాలను కాపాడుతుంది. వారి అభిమానాన్ని చూరగొంటుంది.

అందుచేతనే, మే మిపుడు సమర్పించుతున్న రాజ్యాంగ చట్టం గత వందసంత్సరాలుగా చైనా ప్రజలు సాగించిన విప్లవ పోరాటాల చారిత్రక అనుభవంయొక్క సారమనీ, ఆధునిక



8

కాలంలో చైనా రాజ్యాంగ పద్ధతుల చారిత్రక అనుభవం యొక్క సారమనీ మేము చెబుతున్నాము.

చైనా ప్రజా రిపబ్లిక్ స్థాపితమైనప్పటినుంచి మనం గడించిన నూతన చారిత్రక అనుభవాన్నికూడా ఈ రాజ్యాంగ చట్టం క్రోడీకరిస్తున్నదని వేరే చెప్పనవసరం లేదు.

1949 లో చైనా ప్రజల రాజకీయ సలహా సమితి సమ్మావేశం ఒక ఉమ్మడి కార్యక్రమం ఆమోదించింది. అది తాత్కాలిక రాజ్యాంగ చట్టంగా పని చేసింది. గతంలో విప్లవానుభవాన్ని, ప్రత్యేకించి, ప్రజా విప్లవ స్థావరాలలో గడించబడిన అనుభవాన్ని ఈ ఉమ్మడి కార్యక్రమం ప్రతిబింబించింది. అది చైనా ప్రజా రిపబ్లిక్ స్థాపనను ప్రకటించింది. వివిధ కార్యరంగాలలో చైనా ప్రజారిపబ్లిక్ అమలు పరిచే మూలవిధానాలను ఆ కార్యక్రమం నిర్వచించింది. ఈ ఉమ్మడి కార్యక్రమాన్ని కేంద్ర ప్రజాప్రభుత్వం అన్ని స్థాయిలలోని స్థానిక ప్రజా ప్రభుత్వాలు అమలు పరిచాయి.

చైనా ప్రజా రిపబ్లిక్ ఏర్పడి ఐదు సంవత్సరాలు మాత్రమే అయినప్పటికీ, మన దేశంలో బ్రహ్మాండమైన మార్పులు జరిగాయి.

మొదటిది: మన దేశం ఇప్పుడు విదేశీ సామ్రాజ్యవాద పెత్తనం క్రింద వలస రాజ్యంగా లేదు. చైనా నిజమైన స్వతంత్ర రాజ్యమైంది. 1949 సెప్టెంబరులో చైనా ప్రజల రాజకీయ సలహా సమితి ప్రారంభ సమావేశంలో కామ్రేడ్ మావ్-సే-టుంగ్ యిలా ప్రకటించాడు: "మానవజాతిలో నాలుగవ భాగమైన చైనా ప్రజలు ఈనాడు తమ కాళ్ళమీద నిలబడ్డారు."

వంద సంవత్సరాలకు పైగా విదేశీ సామ్రాజ్యవాదం నుంచి విమోచన సాధించడానికి చైనా ప్రజలు చెప్పనలవి కాని త్యాగాలు చేశారు. వారి కలలు ఫలించాయి. అమెరికా దురాక్రమణను ప్రతిఘటించడానికి, కొరియాకు సహాయపడటానికీ 1950 నుంచి జరిగిన దేశవ్యాప్త ఉద్యమం స్వతంత్ర రాజ్యంగా మన దేశం ప్రతిపత్తిని మరింత దృఢతరం చేసింది. అంతర్జాతీయ రంగంలో చైనా అగ్రరాజ్యంగా స్థానం సంపాదించింది. సోవియట్ యూనియన్‌తో, నూతన ప్రజాతంత్ర రాజ్యాలతో కలిసి, ప్రపంచ శాంతికి కంచుకోటగా చైనా విలసిల్లింది.

రెండవది : తరతరాలుగా మన దేశాన్ని పట్టి పీడిస్తున్న ఫ్యూడలిజం సంకెళ్లు ఇప్పుడు బ్రద్దలైపోయాయి. చైనా అభివృద్ధి స్తంభించటానికీ, వెనుకబాటుతనానికి, అవమానానికి ఒకప్పుడు కారణమైన ఫ్యూడల్ దోపిడీవ్యవస్థ దేశవ్యాపిత ప్రజాఉద్యమం ఫలితంగా మన దేశంలో అత్యధికభాగంలో పూర్తిగా నిర్మూలించబడింది.

మూడవది : దీర్ఘకాలంగా మన దేశంలో నెలకొన్న కల్లోలపరిస్థితులు అంతమైనాయి. అంతర్గతశాంతి ఏర్పడింది. ఇదివరలో ఎన్నడూ జరగనిరీతిలో మొత్తం దేశం ఐక్యమైంది. చైనాలోని వివిధజాతులపట్ల ఇప్పుడు విచక్షణలేదు. ఇదివరలో లాగా అవి ఒకదానినొకటి అనుమానించేస్థితిలో లేవు. సామ్రాజ్యవాదులకు, ప్రజాశత్రువులకు వ్యతిరేకంగాను, జాతీయ సమానత్వం, మైత్రి, పరస్పరసహాయం ప్రాతిపదికమీద, వివిధ జాతులు నేడు ఐక్యమైనాయి. ఉమ్మడిపోరాటం సాగిస్తున్నాయి.

నాలుగు: ప్రజలకు రాజకీయాధికారం లేనిపరిస్థితి చాలవరకు అంతమైంది. మన దేశంలో ప్రజాస్వామ్యం ఉన్నత స్థాయి చేరుకున్నది. వ్యావసాయిక, సాంఘిక సంస్కరణలు, విప్లవ ప్రతీఘాతకుల అణచివేత, అమెరికా దురాక్రమణకు ప్రతిఘటన, కొరియాకు సహాయం మున్నగు ప్రజోద్యమాల ద్వారా, ప్రజలు సమీకృతమైనారు. ప్రభుత్వవ్యవహారాలను ఎన్నడూ పట్టించుకోని విశేషజనసామాన్యం దేశరాజకీయ జీవితంలో ఇపుడు పాల్గొంటున్నారు. ప్రజలే దేశపాలన సాగించుకోటానికి, ప్రజాప్రతినిధుల సభలు సరియైన రాజకీయ సంస్థలని యావన్మంది ప్రజానీకం తమ స్వానుభవంద్వారానే గ్రహించారు.

ఐదవది: విముక్తి తర్వాత మన ప్రజలు తమ పనులలో అపరిమితమైన ఉత్సాహం, చొరవ ప్రదర్శించారు. మన గాఢమిత్ర దేశం, సోవియట్ యూనియన్ ఎంతో సహాయం చేసింది. వీటి ఫలితంగా సామ్రాజ్యవాదులు, కుమింటాంగ్ అభివృద్ధి నిరోధకులు నాశనంచేసిన ఆర్థిక వ్యవస్థను మన దేశం అతికొద్దికాలంలోనే పునర్నిర్మించుకొని, సోషలిస్టు నిర్మాణానికి, సోషలిస్టు పరివర్తనకు పూనుకొన్నది. వాస్తవ జీవితంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారీ విధానం కన్న ఎంతో మిన్న అని నిరూపించుకుంది. అది ఈనాడెంతో బలవత్తరమైంది. జాతీయ ఆర్థిక వ్యవస్థలో నాయకత్వస్థానాన్ని అనుదినం సుస్థిరం చేసుకుంటున్నది. సోషలిజంవైపు పురోగమనానికి మన ప్రభుత్వం తీసుకున్న చర్యలను ప్రజానీకం బలపరచారు. 1953 నుంచి, సోషలిజం నిర్మించాలనే మనలక్ష్యానికి అను

ముఖ్యంగా మన జాతీయ ఆర్థికవ్యవస్థను అభివృద్ధి చేయడానికి, ప్రథమ పంచవర్ష ప్రణాళికను అమలు పరుస్తున్నాము. ఇప్పటికే విజయాలు సాధించాము.

ఈ విషయాలన్నీ గత ఐదు సంవత్సరాలలో మన దేశం ఎంతో పురోగమించిందని తెలుపుతున్నాయి. సుశిక్షితులైన ప్రజల చేతుల్లోకి అధికారం వచ్చి, వారికి సరియైన నాయకత్వం లభించినపుడు మహత్తరమైనశక్తి ఉత్పన్నమవుతుందని, నికృష్ట జీవితం నుంచి ప్రజలకు విమోచనం కలిగి, దేశం వేగంగా ముందుకు వెళ్ళడానికి, ప్రజల భౌతిక, సాంస్కృతిక జీవనం చక్కబడటానికి అవకాశం లభిస్తుందని కూడా పై విషయాలు రుజువు చేస్తున్నాయి. యింవన్నంది చైనా ప్రజల సహకార విశ్వాసాలనే గాక, ప్రపంచ శాంతికాముక జనాళి సానుభూతిని కూడా మన దేశం, ప్రభుత్వం చూరగొంటున్నవంటే పైన వివరించిన అంశాలే కారణం.

మన ప్రజలు చాలకాలంగా ఒక ప్రాథమిక సమస్యపై చర్చలు జరుపుతూ వచ్చారని, ఆధునిక చైనా చరిత్ర స్పష్టం చేస్తున్నది. చైనా నడవవలసిన మార్గమేమిటి? పెట్టుబడిదారీ విధానమా? సోషలిజమా? గత ఐదు సంవత్సరాలుగా మన దేశంలో జరిగిన బ్రహ్మాండమైన మార్పులు పైప్రశ్నకు స్పష్టమైన సమాధానం ఇచ్చాయి. అనేక చిక్కులతో కూడుకున్న ప్రస్తుత ఆర్థిక వ్యవస్థనుండి సోషలిస్టు ఆర్థిక సజామానికి పరివర్తన చెందడం అనగా, ప్రస్తుత నూతన ప్రజాస్వామ్య సమాజంనుండి సోషలిస్టు సమాజానికి మారడం – ఇదొక్కటే

మన దేశం అనుసరించదగిన సరియైన మార్గమని గత 5 సంవత్స రాల జీవితానుభావం తెలిపింది.

ఈనాటిపరిస్థితులదృష్ట్యా, చైనాకు మరొక మార్గ మేమైనా వున్నదా?

వలస, ఫ్యూడల్ పెత్తసంక్రిందకు చైనా తిరిగిరావాలని అమెరికన్ సామ్రాజ్యవాదులు, దేశద్రోహులైన చాంగ్ ముఠావారు చెబుతున్నారు. మన ప్రజలు "దుర్భరజీవితం" గడుపుతున్నారని, మనలను "విముక్తి" చేయడానికి, చైనా ప్రజారిపబ్లిక్‌ను కూలద్రోయడానికి, తమ అభివృద్ధినిరోధక పాలనను పునరుద్ధరించడానికి తాము తిరిగి రావాలని వారంటారు. అంటే, సామ్రాజ్యవాద, ఫ్యూడలిస్టు బురాక్రటిక్ పెట్టుబడిదారీ దుర్మార్గపాలనక్రిందకు మన ప్రజలను తిరిగి తీసుకు రావాలన్నమాట. వందసంవత్సరాల పోరాటంతర్వాత విముక్తి పొందిన చైనాప్రజలు మన దేశాన్ని తిరిగి ఆ దుర్భరపరిస్థితులకు తీసుకువెళ్ళనివ్వరని మనమంతా ఎరుగుదుము. కాని, అమెరికా సామ్రాజ్యవాదం, విద్రోహ చాంగ్‌ముఠా, చైనాభూభాగంపై నున్న వారి ఏజంట్లు, విప్లవప్రతీఘాతకశక్తులు మన దేశం పాతమార్గాలకు మళ్లాలని కోరుతున్నారు. ఇపుడు అమెరికన్ సామ్రాజ్యవాదులు యింకా తైవాన్‌లోనే వున్నారు. విద్రోహ చాంగ్ ముఠా తైవాన్‌లో ప్రజలను యమయాతనలకు గురి చేస్తూ, తిరిగి చైనా భూభాగంపై కాలిడాలని కుట్రపన్ను తున్నారు. అభివృద్ధినిరోధకులు తిరిగి మన దేశంలో కాలుపెట్టే ప్రమాదం పూర్తిగా అంతరించలేదు. ఆ ప్రమాదాన్ని విస్మరించడం చాల పొరబాటు. అందుచేత యావన్మంది చైనా

ప్రజలు ఎల్లప్పుడూ అప్రమత్తులై వుండాలి. జాతీయరక్షణను బలవత్తరం చేయడానికి అపారకృషి జరపాలి. తైవాన్ విముక్తికి, విద్రోహ చాంగ్ ముఠాను సమూలంగా పెరికివేయడానికి ఖచ్చితమైన పోరాటం సాగించాలి.

చైనా తిరిగి పెట్టుబడిదారీ విధానాన్ని అభివృద్ధి చేసుకుని, పెట్టుబడిదారీ రాజ్యాంగం తయారవడం సాధ్యమా? చైతన్యంలేని కొందరు అలాంటి భ్రమలో వుండవచ్చు. కాని అది చాల పొరపాటైన, ప్రమాదకరమైన భ్రమ.

"బూర్జువా రిపబ్లిక్ అనేది విదేశాలలో కొనసాగింది. కాని చైనాలో అది మనలేకపోయింది" అని కామ్రేడ్ మావ్-సే-టుంగ్ చెప్పాడు. కార్మిక వర్గనాయకత్వాన నడుస్తున్న చైనా ప్రజలు ఈ దేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని అనుమతించరు. కార్మికవర్గ నాయకత్వాన వున్న నూతన ప్రజాతంత్ర నియంతృత్వం బూర్జువా నియంతృత్వంగా మార్పుచెందడానికి కూడా వారు అంగీకరించరు. ప్రపంచ పెట్టుబడిదారీ విధానం పతనమైపోతున్నది. బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలన్నీ ఇపుడు సంక్షోభంలో చిక్కుకొన్నాయి. కాగా, సోషలిస్టు సోవియట్ దేశం, నూతన ప్రజాతంత్ర దేశాలు సర్వసంపన్నమై పరిఢవిల్లుతున్నాయి. కార్మికవర్గ నాయకత్వాన మన ప్రజలు సోషలిజం నిర్మిస్తున్నారు. మనదేశ స్వరూపం మారిపోతున్నది. ప్రజల భౌతిక, సాంస్కృతిక జీవితం క్రమంగా అభివృద్ధి చెందుతున్నది. అంతర్గత పరిస్థితి, అంతర్జాతీయ పరిస్థితి ఇలా వుండగా, చైనాప్రజలు సుఖసంపదలతో విలసిల్లనున్న సోషలిజాన్ని విడనాడి, అష్టకష్టాలకి, దారిద్ర్యానికి దారి

తీసే పెట్టుబడిదారీ మార్గాన్ని చేబడతారా? అది అసంభవం. అందుచేత అలాంటిభ్రమలున్నవారు వాటిని సత్వరం వదలించుకోవాలి. కలలు కంటూండాలని అనుకునేవారు, భ్రమలను అంటిపెట్టుకునేవారు, సామ్రాజ్యవాదులు చూపే ప్రమాదకరమైన మార్గంలో పడిపోయే అవకాశముంది. ఎందుచేతనంటే చైనా పెట్టుబడిదారీ మార్గాన్ని అనుసరించాలనేవారు సామ్రాజ్యవాదులతో కలవడం అనివార్యం. అయితే ఒక్క విషయం ఖాయం. చైనా స్వతంత్ర పెట్టుబడిదారీరాజ్యం కావడానికి సామ్రాజ్యవాదులు ఎన్నడూ అనుమతించరు. చైనాను సామ్రాజ్యవాద, ఫ్యూడల్, వాణిజ్య పెట్టుబడిదారీపాలనక్రింద వలసగా మార్చుతారు. దేశద్రోహి చాంగ్-కై-షేక్ అనుసరించిన మార్గమదే.

చైనాకు మరొక మార్గ మేమైనా వుందా? కొంత మంది ప్రస్తుత పరిస్థితినే అట్టిపెట్టాలని భావిస్తూ వుండవచ్చు. అంటే, పెట్టుబడిదారీ మార్గాన్నికాని, సోషలిస్టు మార్గాన్ని కాని అనుసరించక, సోషలిస్టు-పెట్టుబడిదారీ అంశాలుగల పరిస్థితినే కొనసాగించడమన్నమాట. అనగా, మనం ఈనాడున్న స్థితిని అలాగే వుంచడమన్నమాట.

చైనా ఈనాడు సోషలిస్టు సమాజాన్ని నిర్మించే పరివర్తనదశలో వున్నదని మనకందరికీ తెలుసు. ఈ దశనే మనం నూతన ప్రజాతంత్ర దశ అని పిలుస్తాము. ఈ దశలో మన ఆర్థిక వ్యవస్థలో సోషలిస్టు అంశాలు, పెట్టుబడిదారీ అంశాలు కూడా వుంటాయి. ఈ పరిస్థితిని శాశ్వతంగా కొనసాగించవచ్చునని, అసలు మార్పులు చేయకపోవడమే ఉత్తమమని

కొందరు ఆశిస్తున్నారు. ఉమ్మడి కార్యక్రమం మనకు చాలు నంటున్నారు. మనకు రాజ్యాంగచట్టం ఎందుకని ప్రశ్నిస్తున్నారు. "నూతన ప్రజాతంత్ర వ్యవస్థను సంఘటితపర్చడం" అనే మాటను గత కొద్ది సంవత్సరాలలో మనం తరచు వింటూవచ్చాం. ఇలాంటి పదజాలం ప్రస్తుత స్థితిని మార్పు లేకుండా నిలబెట్టే దృక్పథాన్నే తెలుపుతుంది. అయితే అది సాధ్యమేనా? సోషలిజంక్రింద, పెట్టుబడిదారీవిధానంక్రింద పరస్పర విరుద్ధమైన ఉత్పత్తి సంబంధాలు, ఒకదానితో నొకటి ఘర్షణ పడకుండా, ఒక దేశంలో ఒకదాని సరస నొకటి అభివృద్ధిచెందడం అసాధ్యం. చైనా సోషలిస్టురాజ్యంగానో, పెట్టుబడిదారీరాజ్యంగానో మారాలి. చైనాలో మార్పు రాకుండా నిరోధించడమంటే, చరిత్రగతినే స్తంభింపచేయడమన్న మాట.

---

ఇది అసాధ్యం. నేనీవరకే చెప్పినట్లు, చైనాకు పెట్టుబడిదారీ రాజ్యంగా మార్పు చెందడానికి మార్గం బందయింది. అందుచేత సోషలిస్టుబాట ఒక్కటే చైనాకు అనుసరణీయం. అంతేగాక, చైనా చారిత్రకపరిణామసూత్రంకూడా ఇదే. ఇదితప్ప మన కింకొకమార్గం లేదు.

అందుచేత సోషలిజంవైపు చైనా పురోగమనం తిరుగులేనిదని స్పష్టమవుతుంది. చైనా మరొకమార్గాన్ని నడవజాలదు.

చైనా ప్రజారిపబ్లిక్ స్థాపననుంచీ, చైనా సోషలిస్టు మార్గాన్నే పయనిస్తున్నది. మన రాజ్యాంగచట్టం ముసాయిదా ఉపోద్ఘాతంలో ఇలా వుంది:

"చైనా ప్రజారిపబ్లిక్ స్థాపననుంచి, సోషలిస్టు సమాజ నిర్మాణంవరకూ ఒక పరివర్తనదశ. అంచలంచలుగా దేశంలో సోషలిస్టు పారిశ్రామికీకరణను సాధించడం, క్రమక్రమంగా వ్యవసాయంలో, చేతిపనులలో, పెట్టుబడిదారీపరిశ్రమలలో, వాణిజ్యంలో సోషలిస్టు పరివర్తనను సాధించడం - ఇవి ఈ పరివర్తనదశలో ప్రభుత్వ కర్తవ్యాలుగా వుంటాయి."

1953 నుంచి సోషలిజాన్ని లక్ష్యంగా పెట్టుకుని, ప్రణాళికాబద్ధమైన ఆర్థికనిర్మాణకార్యక్రమ లో చైనా అడుగు పెట్టింది అందుచేత ఉమ్మడి కార్యక్రమ ప్రాతిపదికపై మనం ఇపుడు మరొక అడుగు ముందుకు వేయాలి. పరివర్తనదశలో మన ప్రధానకర్తవ్యాలను చట్టరూపంలో పొందుపరచేందుకు గాను ఇలాంటి రాజ్యాంగచట్టాన్ని ఆమోదించాలి.

మన దేశంలో సోషలిస్టుపారిశ్రామికీకరణను, సోషలిస్టుపరివర్తనను సాధించడం అత్యంత కష్టభరితమైన, క్లిష్టమైన కార్యక్రమం. ఇలాంటి కర్తవ్యనిర్వహణకు మన దేశంలోని యావన్మంది ప్రజల శక్తియుక్తులను సమీకరించాలి; ప్రజల చొరవను, ఉత్సాహాన్ని పెంపొందించాలి. సరియైనట్టి ఉన్నతస్థాయిలో కేంద్రీకృతమైనట్టి నాయకత్వంక్రింద అన్ని విధాలైన కష్టాలను అధిగమించాలి. అందుచేత ఒకవైపు ప్రజాస్వామ్యంలో ప్రజలు పరిపూర్ణమైన పాత్ర నిర్వహించేట్టు చూడాలి. నూతన ప్రజాస్వామ్యాన్ని విస్తృతపరచాలి. మరొకవైపు ప్రభుత్వవ్యవస్థకు మరింత ఏకీకృతమైన నాయకత్వం ఏర్పరచాలి. ఇందుకుగాను ఉమ్మడి కార్యక్రమంకన్నా సమగ్రమైన రాజ్యాంగచట్టాన్ని అమలుపరచవలసిన అవసర

ముంది. ఇపుడు మీకు సమర్పించిన రాజ్యాంగచట్టం అలాంటిదే.

ఈ రాజ్యాంగచట్టం చర్చలోనున్నప్పుడు ఇది మన దేశ చారిత్రక అనుభవ క్రోడీకరణమే గాబట్టి, దీనియెడల ప్రజలు తమ హృదయపూర్వకహర్షాన్ని వెల్లడించారు. ఈ రాజ్యాంగ చట్టం ప్రజల అభీష్టంనుంచి ఉద్భవించింది; ప్రజల ప్రయోజనాలను ప్రతిబింబిస్తున్నది. మన దేశంలో కలిగిన అపారమైన మార్పులకుకూడా అది ప్రతిబింబం.

ఇతర దేశాల అనుభవంనుంచికూడ మన రాజ్యాంగ చట్టంలో అనేక అంశాలు పొందుపరచబడినాయి. ప్రజల ఈ రాజ్యాంగచట్టాన్ని హర్షించడానికి అదికూడా ఒక కారణం. ఈ రాజ్యాంగచట్టాన్ని రచించేటప్పుడు రచనాసంఘం సోవియట్‌లో గతంలో అమలుపరచబడిన రాజ్యాంగచట్టాలను ప్రస్తుతం అమలుపరచబడుతున్న రాజ్యాంగచట్టాన్ని నూతన ప్రజాతంత్ర దేశాల రాజ్యాంగచట్టాలను పరిశీలించింది.

సోవియట్ యూనియన్ నాయకత్వానవున్న సోషలిస్టు రాజ్యాల అనుభవం మనకు చాలా తోడ్పడింది. మన ముసాయిదారాజ్యాంగం మనదేశ అనుభవాన్ని, ఇతర దేశాల అనుభవాన్నికూడా ప్రతిబింబిస్తున్నది. అది చైనాలో విప్లవోద్యమఫలితంగా రూపొందినదిమాత్రమేగాక అంతర్జాతీయ సోషలిస్టుఉద్యమనుంచికూడ అది ఉత్పన్నమైనది.

ఇది మనరాజ్యాంగం చారిత్రక ప్రాధాన్యత.

## 2. ముసాయిదా రాజ్యాంగచట్టంలోని ప్రధానాంశాలపై కొన్ని వివరణలు

ఇపుడు ముసాయిదా రాజ్యాంగచట్టంలోని ప్రధానాంశాలను యీ క్రింది శీర్షికలక్రింద కొంత వివరించ దలచుకున్నాను:

(1) మన ప్రభుత్వ వ్యవస్థ స్వరూపం:

"చైనా ప్రజారిపబ్లిక్ కార్మికవర్గ నాయకత్వంక్రింద, కార్మిక కర్షక ఐక్యతపై ఆధారపడిన నూతన ప్రజాతంత్ర వ్యవస్థ" అని రాజ్యాంగం ముసాయిదాలో మొదటి ఆర్టికల్ చెబుతున్నది. మన నూతన ప్రజాతంత్రవ్యవస్థక్రింద విశాలమైన ప్రజాతంత్రఐక్యసంఘటన ఇంకా వున్నదని ముసాయిదా ఉపోద్ఘాతం, ఇతర ఆర్టికల్సు స్పష్టంచేస్తున్నవి.

కార్మికవర్గ నాయకత్వంపై ఆధారపడే చైనాప్రజలు సామ్రాజ్యవాద, ఫ్యూడల్, బురాక్రటిక్ పెట్టుబడిదారీవిధానాలనుంచి విముక్తి పొందగలరనే సత్యాన్ని, చిరకాల చారిత్రకానుభవం నిరూపించింది. ప్రజలు విజయం సాధించినతర్వాత కొత్త సమస్య ఒకటి ఉత్పన్నమైంది. కార్మికవర్గం గతంలోవలె ఇపుడుకూడా జాతీయ నిర్మాణ కార్యక్రమాన్ని నడిపించడంలో సామర్థ్యాన్ని ప్రదర్శించగలదా అనే ప్రశ్న వచ్చింది.

"సరే ఏం జరుగుతుందో చూద్దాం" అనే వైఖరిని మొదట్లో కొంతమంది ఆరంభంలో ప్రదర్శించినా, గత 5 సంవత్స

రాల అనుభవం దేశానికి నాయకత్వం వహించడంలో కార్మిక వర్గం ఎంత అసమానమైన మేధస్సును చూపగలదో రుజువు చేసింది. చైనాప్రజలు సాధించిన విజయాలను సురక్షితం చేసుకోవాలంటే, ప్రభుత్వవ్యవస్థపై కార్మికవర్గనాయకత్వాన్ని మరింత పటిష్ఠంచేయడం అవసరం. అలాంటి నాయకత్వం లేనిదే, సోషలిస్టునిర్మాణం, సోషలిస్టుపరివర్తనం విజయంపొందడం అసూహ్యం.

కార్మికవర్గనాయకత్వం జయప్రదమవాలంటే, కార్మిక కర్షక ఐక్యతను నిరంతరం బలపరచాలి. గతంలో విప్లవపోరాటాలలో ఇది ఎంత అవసరమైందో, ఇప్పుడు జాతీయ నిర్మాణ కార్యక్రమాలలోనైతం అంత అవసరమే. సామ్రాజ్యవాద ఫ్యూడల్ వ్యతిరేక విప్లవపోరాటాలలో రాటుతేలిన కార్మిక కర్షక ఐక్యత, చైనా ప్రజారిపబ్లిక్ స్థాపన జరిగినప్పటినుంచీ బలపడింది. కాని, బలహీనం కాలేదు. సోషలిజానికి క్రమంగా పరివర్తనచెందే దశలో, రైతులలో తప్పక మార్పు వస్తుంది. ఆ మార్పు ప్రారంభమైందికూడా. అది ఏరూపంలో వుంటుందంటే రేపేమవుతుందోననేభయంతో జీవితం గడిపే వ్యక్తిగత రైతులు, సోషలిస్టు సహకారవ్యవసాయదారులుగా క్రమంగా పరివర్తన చెందుతారు. ఈ సహకారమార్గంలో రైతాంగాన్ని కార్మికవర్గం నడిపినపుడే, రైతులజీవనం బాగుపడుతుంది. కార్మిక కర్షక ఐక్యత దృఢతర మవుతుంది.

మన దేశంలోని కష్టజీవులలో కార్మికులు, కర్షకులేగాక చేతిపనులలో, వ్యవసాయేతరవృత్తులలో నిమగ్నమైన గ్రామీణ పట్టణవాసులు అనేకమంది వున్నారు. వారు తమ

జీవనానికి తమ శ్రమపైనే ఆధారపడతారు. రైతాంగంతో కలిసినట్లే వీరితోకూడా కార్మికవర్గ సోషలిస్టునిర్మాణ కార్యక్రమంలో చేతులుకలపాలి. వీరితో ఐక్యమవడంకూడా కార్మిక కర్షక ఐక్యత కర్తవ్యంలో భాగమే.

మన ప్రభుత్వ వ్యవస్థ కార్మిక కర్షక ఐక్యత ప్రాతిపదికపై, కార్మికవర్గ నాయకత్వంక్రింద నడుపబడుతున్నదన్న వాస్తవవిషయం మన ప్రభుత్వవ్యవస్థయొక్క మూలస్వరూపాన్ని తెలుపుతుంది. చైనా నూతనప్రజాతంత్ర రాజ్యమని అది స్పష్టంచేస్తుంది. నూతన ప్రజాతంత్రరాజ్యాలకు, పెట్టుబడిదారీ దేశాలకు స్వరూపంలో అపారమైన తేడా వున్నది. పెట్టుబడిదారీ దేశాలలో "ప్రజాస్వామ్యం" గురించి వారెంత గొంతులుచించుకున్నా జనాభాలో అతి చిన్నభాగమైన బూర్జువావర్గమే పరిపాలన చేస్తుంది. మనదేశంలో మన ప్రభుత్వ వ్యవస్థనాయకులు అత్యధికసంఖ్యాక ప్రజానీకమే.

మన దేశంలోని మేధావులు గతంలో విప్లవోద్యమంలో ప్రముఖమైన పాత్ర వహించారు. సోషలిజం నిర్మాణంలోకూడా అంతకంటె ప్రముఖమైన పాత్ర నిర్వహిస్తారు. వివిధ సాంఘిక తరగతులనుంచి వచ్చే మేధావులు తామొక ప్రత్యేకవర్గం కాజాలరు. వారు కార్మికవర్గంతో కలిసినపుడు కార్మికవర్గ మేధావులవుతారు. బూర్జువావర్గంతో కలిసినపుడు బూర్జువా మేధావులవుతారు. ఫ్యూడల్ - వాణిజ్య పెట్టుబడిదారీవర్గంతో కలిసిన కొద్దిమంది అభివృద్ధినిరోధక మేధావులైనారు. అభివృద్ధినిరోధకులుగానే వుండి, చైనా రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా పనిచేసే కొద్దిమందిని మినహాయించి, మిగతా

మేధావులందరినీ మన ప్రభుత్వవ్యవస్థ సమీకరించాలి. తమ భావాలను చక్కజేసుకోడానికి, సోషలిజం నిర్మాణానికి తమ సామర్థ్యాన్ని వినియోగించడానిక వారికి మన ప్రభుత్వ వ్యవస్థ తోడ్పడాలి. కామ్రేడ్ మావ్-సే-టుంగ్ చాలకాలం క్రితమే ఇలా చెప్పాడు:

"ప్రజాసేవలో పేరుపొందిన మేధావులందరినీ, మన వ్యవస్థకూ, సంఘానికీ విలువైన ఆస్థులుగా మనం గౌరవించాలి."

ముసాయిదా రాజ్యాంగం ఉపోద్ఘాతంలో ఇలా వుంది :

"భవిష్యత్తులో, పరివర్తనదశలో, మన రాజ్యాంగ యంత్రం తన కేంద్ర కర్తవ్యాన్ని నిర్వహించడానికి, అంతర్గత, విదేశీయ శత్రువులను ప్రతిఘటించడానికీ, మన ప్రజలందరినీ సమీకరించడంలోను, చైనాప్రజల ఐక్యసంఘటన తన పాత్ర నిర్వహిస్తూనే వుండగలదు."

కార్మికవర్గ నాయకత్వాన, వివిధ ప్రజాతంత్ర వర్గాలతో, ప్రజాతంత్ర పార్టీలతో, గ్రూపులతో, ప్రజాసంస్థలతో కూడిన ప్రజాతంత్ర ఐక్యసంఘటన పరివర్తనదశలో నిర్వహించే ముఖ్యమైన పాత్రను ఇది తెలుపుతుంది. ఈ ఐక్య సంఘటనకు కార్మిక కర్షక ఐక్యతే ప్రాతిపదిక అయినప్పటికీ, దానికంటె విశాలమైనది కష్టజీవులకు, కష్టజీవులు కాకపోయినా సహకరించదగిన వారికీ మధ్య ఏర్పడే ఐక్య సంఘటన. మనం సోషలిజం నిర్మిస్తున్నందున, అలాంటి ఐక్యసంఘటన సాధ్యం కాదని, అనవసరమని భావించడం పొరపాటు.

పరివర్తన దశలోనున్న మన దేశంలో జాతీయ బూర్జువా వర్గం ఇంకా వున్నది. దోపిడీచేసే వర్గాలు, దోపిడీకి గురిఅయ్యే

వర్గాలు వున్న ఏ సమాజంలోనైనా, వర్గపోరాటం వుంటుంది. అయితే మన దేశంలోని ప్రత్యేక చారిత్రక పరిస్థితులవల్లా-మన జాతి విదేశీసామ్రాజ్యవాదంచేత అణచివేయబడ్డంవల్ల-చైనా కార్మికవర్గానికి, బూర్జువావర్గానికి సంఘర్షణేగాక, ఐక్యత కూడావున్నది. కార్మికవర్గ నాయకత్వంక్రింద బూర్జువావర్గం గతంలో జాతీయ ప్రజాతంత్ర విప్లవంలో పాల్గొన్నది. గత ఐదు సంవత్సరాలలో దేశభక్తియుత ఉద్యమాలలో, ఆర్థిక, పునరావాస కార్యక్రమాలలోకూడా పాల్గొన్నది. శాన్‌ఫాన్ ఉద్యమం (అవినీతి, దుబారా, బ్యూరాక్రటిజంలపై జరిగిన పోరాటం) తర్వాత వూఫాన్ ఉద్యమం (ప్రభుత్వ కార్యకర్తలలో లంచగొండితనం, పన్నుల ఎగవేత, ప్రభుత్వ ఆస్తుల దొంగతనం, ప్రభుత్వ కాంట్రాక్టులలో మోసం, ప్రయివేటు వ్యాపారంకోసం ప్రభుత్వ ఆర్థిక సమాచారాల చౌర్యం మున్నగు దుర్వ్యాపారాలకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం) తర్వాత, పెట్టుబడిదారులు చాలమంది తమ రాజకీయ పరిజ్ఞానాన్ని వృద్ధిచేసుకుని, సోషలిస్టు మార్పులపట్ల సుముఖత ప్రదర్శించారు. పెట్టుబడిదారీ పరిశ్రమను, వాణిజ్యాన్ని, అచంచలంగా సోషలిస్టు పద్ధతులకు మార్పుచేసే విధానం చేబట్టడానికి ఇది అవకాశం కల్పిస్తున్నది. మన మిప్పుడు అలాంటి మార్పులను అమలుపరుస్తున్నాం. పరివర్తనదశలో, బూర్జువావర్గం మన ఆర్థిక వ్యవస్థలో ప్రధానమైన పాత్రను నిర్వహిస్తుంది. ఉత్పత్తి విస్తరణ, సోషలిస్టు మార్పులను అంగీకరించడం, పరిశ్రమల నిర్వహణను, ఉత్పత్తిమార్గాలను అభివృద్ధి పరచటం, నిపుణులైన కార్మికులకు, టెక్నీషియన్లకు శిక్షణ ఇవ్వడం

మున్నగువిషయాలలో బూర్జువావర్గం ఇప్పటికీ మన రాజ్యాంగ యంత్రానికి తోడ్పడగలదు. పరివర్తనదశలో జాతీయబూర్జువా వర్గానికి మన రాజకీయ జీవితంలో చక్కటి హోదావుంది.

మన సమాజంలో, ప్రత్యేకించి జాతీయ మైనారిటీ వర్గాలలో మనదేశాన్ని ప్రేమించే ఇతరవర్గాలవారున్నారు. వారిని సమీకరించడానికి మన రాజ్యాంగయంత్రం ప్రత్యేకించి కృషి చేయాలి.

దీనినిబట్టి తేలేదేమిటంటే, ఈనాడు మనదేశంలో నున్న ఐక్యసంఘటనకు ఇంకా విస్తృతమైన ప్రాతిపదిక వున్నది.

కార్మికవర్గ నాయకత్వాన మనదేశప్రజల విప్లవాత్మక ఐక్యత, ప్రజాతంత్ర విప్లవానికే గాక, సోషలిజం సాధనకు కూడా అవసరమేనని చైనా కమ్యూనిస్టుపార్టీ ఎన్నడో స్పష్ట పరచింది. సామ్రాజ్యవాద ప్రమాదాన్ని మనం ఇంకా ఎదు ర్కొంటూనే వున్నాం. మన ప్రజలముందు రెండే రెండు మార్గాలున్నవి. సామ్రాజ్యవాదదాస్యానికి గురికావడమో, సోషలిజాన్ని సాధించడమో, ఏదో ఒకటి తప్ప మరొక మార్గం లేదు. సోషలిజంవైపు పురోగమించడం ద్వారానే, చైనా స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని సాధించగలదు. శక్తి సంపన్నమై విలసిల్లగలదు. ఇట్టి పరిస్థితిలో, వలస దాస్యాన్ని అంగీకరించనొల్లని దేశభక్తులందరూ కార్మికవర్గ నాయకత్వాన్క్రింద ఐక్యమై, సోషలిస్టు మార్గాన్ని నడవడం సుసాధ్యమే. కార్మికవర్గ నాయకత్వాన్ని, కార్మిక కర్షక ఐక్యతను సాధ్యమైన పరిమితులలో బలపరచినప్పుడు, ప్రజల ఐక్యత విశాలమవుతుంది. సోషలిజానికి ఇతోధికంగా మేలు



10

కలుగుతుంది. అందుచేత మనరాజ్యాంగస్వరూపం ఎలా వుండాలంటే, సోషలిస్టు సమాజనిర్మాణానికి యావన్మంది ప్రజలు ఐక్యమవడానికి అది వీలుకలిగించాలి.

(2) సోషలిస్టు సమాజ పరివర్తనకు తీసుకోవలసిన చర్యలు:

ముసాయిదా రాజ్యాంగంలోని 4 వ ఆర్టికల్‌లో ఇలా వుంది: "రాజ్యాంగయంత్రి ఉపాంగాలపైన, సాంఘికశక్తుల పైన ఆధారపడటంద్వారా, సోషలిస్టు పరిశ్రమలను నెలకొల్పడంద్వారా, సోషలిస్టుమార్పులను ప్రవేశపెట్టడంద్వారా, దోపిడీ పద్ధతులను అంచలంచెలుగా నిర్మూలించడానికి, సోషలిస్టు సమాజ నిర్మాణానికి చైనా ప్రజారిపబ్లిక్ కృషిచేస్తుంది."

ఈ ఆర్టికల్‌లో పేర్కొన్న విధానాన్ని పూర్తిగా అమలు జరిపించడానికి, సాధారణసూత్రాల శీర్షిక క్రింద ఇలా ఆర్టికల్స్‌లో అనేక ఏర్పాట్లు చేయబడినాయి. ఈ అంశాలు, సోషలిస్టుసమాజనిర్మాణ లక్ష్యాన్ని, అలాంటి సమాజ నిర్మాణానికి అవసరమైన చర్యలను నిర్వచిస్తాయి.

పరివర్తనదశలో చైనాలో ఇంకా వివిధములైన ఆర్థిక రంగాలున్నవి. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం ప్రధానంగా ఈ క్రింది తరగతులుగా విభజించబడివుంది. ప్రభుత్వ యాజమాన్యం అంటే యావన్మంది ప్రజల యాజమాన్యం. సహకార యాజమాన్యం-అనగా కష్టజీవుల సమిష్టి యాజమాన్యం; వ్యక్తిగతంగా కష్టజీవుల యాజమాన్యం; పెట్టుబడిదారీ యాజమాన్యం-మొదటి రెండుతరగతులను, అనగా సోషలిస్టు రంగాలను బలవత్తరం చేయడానికి ప్రభుత్వం పూను

కోవాలి, తత్ఫలితంగా, "ప్రభుత్వ యాజమాన్యంలోని ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి మొదటి ప్రాధాన్యత ఇవ్వబడుతుంది. సోషలిజంయొక్క ప్రధాన ఆర్థిక పునాదియైన భారీ పరిశ్రమల క్రమబద్ధనిర్మాణానికి ప్రత్యేక శ్రద్ధచూపబడుతుంది. అదే సమయంలో, ప్రభుత్వం "సహకార ఆర్థికవ్యవస్థ అభివృద్ధిని ప్రోత్సహిస్తుంది. దానికి తోడ్పడుతుంది.

రాజ్యాంగ ముసాయిదాలోని ఈ అంశాలు ఊహాపై ఆధారపడినవి కావు. చైనా ప్రజారిపబ్లిక్ స్థాపన కాలంనుంచి సాంఘిక ఆర్థిక సంబంధాలలో కలిగిన మార్పులు, ప్రజల అనుభవాలు వీటికి ప్రాతిపదికలు. అందుచేత ఇవన్నీ ఆచరణ సాధ్యమైనవే. ఈ అంశాలకు సంబంధించి, యీ క్రింది సమస్యలపై నేను మాట్లాడదలిచాను.

మొదటిది పరివర్తనరూపాలకు సంబంధించిన సమస్య. వ్యవసాయంలో, చేతి పరిశ్రమలలో, పెట్టుబడిదారీ పరిశ్రమలలో, వాణిజ్యంలో సోషలిస్టు మార్పులు అమలుపరచడం చాల క్లిష్టమైనపని. నిమిషాలమీద ఈ మార్పులు తీసుకు రావడం సాధ్యమయ్యేపనికాదు. ప్రజల అనుభవాలనూ, రాజకీయ చైతన్యాన్ని, దృష్టిలో పెట్టుకుని, వాస్తవంగా ఆచరణలో సాధ్యమయ్యే విషయాలను గుర్తించి, క్రమంగా ముందుకు సాగాలి. వ్యవసాయం, చేతిపరిశ్రమలలోగాని, పెట్టుబడిదారీ పరిశ్రమ, వాణిజ్యాలలోగాని, సోషలిస్టుమార్పులు తీసుకు రావడంలో పరివర్తనదశలో కొన్ని మార్గాలున్నవని, మనం అవలంబించే ఈ మార్గాలు అవసరాన్నిబట్టి మార్పుకో డానికి తగినవిగానూ, విభిన్నమైనవిగానూ వుండాలని మన అనుభవం తెలుపుతున్నది.

పాక్షికంగా కష్టజీవుల సమష్టి యాజమాన్యంలో వుండే సహకారసంస్థను వ్యవసాయంలో, చేతి పరిశ్రమలలో సోష లిస్టుమార్పులు ప్రవేశపెట్టడానికి ప్రధానమైన మార్గంగా పేర్కొనవచ్చు.

ఉదాహరణకు, వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకార సంస్థ ఇటీవల మన గ్రామీణప్రాంతాలలో అభివృద్ధి చెందింది. దానిలో ప్రత్యేకత ఏమంటే, ఆ సంస్థలోని సభ్యులు తమ భూములను వాటాలుగా పెడతారు. సంస్థను కేంద్రీకృతంగా నిర్వహిస్తారు. చైనా చారిత్రక పరిస్థితులలో, ఈ పరివర్తన రూపాన్ని క్రమంగా, విస్తృతంగా ఉపయోగించడంద్వారా, వ్యక్తిగత కష్టజీవులు ఈ రకమైన అర్థసోషలిస్టు సహకార విధానంద్వారా, కష్టజీవుల సమష్టియాజమాన్యానికి సుల భంగా సాగిపోగలుగుతారు.

పెట్టుబడిదారీ పరిశ్రమలను, వాణిజ్యాన్ని సోషలిస్టు పద్ధతులకు మార్చడానికి పరివర్తన రూపం ప్రభుత్వపెట్టుబడి దారీ విధానం. చైనా చారిత్రక పరిస్థితులలో, వివిధములైన ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాలద్వారా, పెట్టుబడిదారీ పరి శ్రమను, వాణిజ్యాన్ని క్రమంగా సోషలిస్టుపద్ధతులకు మార్చగలం. కార్మికవర్గ నాయకత్వానవున్న ప్రభుత్వపు అధీనంలో వుండే పెట్టుబడిదారీ విధానం బూర్జవాపాలనక్రింద వుండే ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానానికి విభిన్నమైనది. లెనిన్ ఇలా చెప్పాడు: "ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం అంటే, మనం పరిమితులలో వుంచగలిగిన, దాని హద్దులను మనం నిర్ణ యించగలిగిన పెట్టుబడిదారీ విధానమే." ప్రభుత్వ పెట్టుబడిదారీ

ఆర్థిక విభాగంలో, ఒకవైపు, పెట్టుబడిదారీ యాజమాన్యం ఇంకా రద్దుచేయబడలేదు. కాబట్టి పెట్టుబడిదారులు లాభాలు చేసుకోవచ్చు. అయితే వారు ఇదివరకటివలె, లాభాలనే తమ లక్ష్యంగా పెట్టుకోడానికి వీలుండదు. ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానంద్వారా, పెట్టుబడిదారీ యాజమాన్యం స్థానంలో ప్రజాసామాన్యం యాజమాన్యం నెలకొల్పడానికి అనుకూలమైన పరిస్థితులు ఏర్పరచవచ్చు.

ఈ పరివర్తన రూపాలు రాజ్యాంగం ముసాయిదాలో స్పష్టంగా పేర్కొనబడటం, మనదేశంలో సోషలిజం నిర్మాణానికి అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది.

ఇక, శాంతియుతంగా సోషలిస్టు సమాజాన్ని నిర్మించే సమస్యపై మాట్లాడతాను. రాజ్యాంగ ముసాయిదాపై దేశమంతటా చర్చ జరిగినపుడు చాలమంది ఇలా అడిగారు: "చైనా శాంతియుతంగా దోపిడీ విధానాన్ని నిర్మూలించి, సోషలిస్టు సమాజాన్ని నిర్మించడానికి నూతన ప్రజాతంత్ర వ్యవస్థ హామీ ఇస్తుందని రాజ్యాంగ ముసాయిదా ఉపోద్ఘాతం) ఎందువల్ల చెబుతోంది?"

మనదేశంలో కొద్దిప్రాంతాలలో తప్ప, ఫ్యూడల్ దోపిడీ విధానం విప్లవసమరంలో, భూసంస్కరణలలో పూర్తిగా నిర్మూలించబడింది. అయితే, సోషలిస్టుసమాజ నిర్మాణానికి, పెట్టుబడిదారీ దోపిడీ విధానాన్నికూడా, నిర్మూలించడం అవసరం. సాంఘికమార్పులో ఇది మరొకముందడుగు. పెట్టుబడిదారీదేశంలో ఈ మార్పులు తీసుకురావాలంటే, రాజ్యాంగవ్యవస్థ అయిన బూర్జువా నియంతృత్వాన్ని కూల





ద్రోయటానికి కార్మికవర్గం, కష్టజీవులూ విప్లవమార్గం చేబట్టాలి. కాని, మన దేశంలో ఈనాటి రాజకీయ, ఆర్థిక పరిస్థితులు పెట్టుబడిదారీ దేశాలలోని పరిస్థితులకు పూర్తిగా విభిన్నమైనవి. మన దేశం కార్మికవర్గ నాయకత్వాన నూతన ప్రజాతంత్ర రాజ్యాంగ వ్యవస్థను నెలకొల్పింది. మన దేశంలో ఇప్పటికే ప్రభుత్వ యాజమాన్యంలో దినదినాభివృద్ధి చెందే సోషలిస్టు ఆర్థికరంగం వున్నది. ఇది మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థలో అగ్రస్థానం వహించింది. పెట్టుబడిదారీ ఆర్థికరంగ ప్రాబల్యం ఇప్పుడు పోయింది. అందుచేత మన దేశంలో సోషలిస్టు విప్లవానికి, పెట్టుబడిదారీ దేశాలలో సోషలిస్టు విప్లవానికి తేడా వుంది. మన దేశంలో బూర్జువా రాజ్యాంగ వ్యవస్థను కూలద్రోయడమనే సమస్యే లేదు. ప్రస్తుతమున్న రాజ్యాంగ యంత్రంలో, సాంఘిక శక్తుల సహాయంతో క్రమంగా సోషలిజం నిర్మాణాన్ని కొనసాగించవచ్చు. అంతేగాక, నేనిదివరకే చెప్పినట్లు మన దేశంలో కార్మికవర్గానికి, బూర్జువావర్గానికి మధ్య ఐక్యతాసంబంధాలున్నవి. ఈ కారణంవల్ల, మనం పెట్టుబడిదారీ దోపిడీవిధానాన్ని నిర్మూలించడంలో, 1950 –, 52 సంవత్సరాలలో భూసంస్కరణలను అమలుపరచేందుకు మనం అవలంబించిన పద్ధతులను అనుసరించవలసిన అవసరంలేదు. అప్పుడు మనం కొద్దికాలంలో విశాలమైన ప్రజాఉద్యమాన్ని సాగించి, ఫ్యూడల్ విధానాన్ని ఒకే ఒక దెబ్బతో నిర్మూలించాం. పెట్టుబడిదారీ వాణిజ్యపరిశ్రమలలో సోషలిస్టుమార్పులు క్రమంగా దీర్ఘకాలంలో, వివిధమైన ప్రభుత్వ పెట్టుబడిదారీ పద్ధతుల ద్వారా సాధించబడుతాయి. ప్రభుత్వం, కార్మికవర్గాల నాయ

కత్వం క్రింద ఈమార్పులను పెట్టుబడిదారులు అంగీకరించేందుకు వీలుగా వారికి తగువ్యవధి యిస్తాం. అయితే, పోరాటాలు తప్పనిసరిగా వస్తాయి.

ఇపుడు పోరాటాలున్నవి; ఇకమీదటకూడ వుంటాయి. ఈనాడుకూడ కొంతమంది పెట్టుబడిదారులు చట్టవిరుద్ధమైన కార్యకలాపాలు సాగిస్తున్నారు. కొంతమంది అసలు సోషలిస్టు మార్పులనే ప్రతిఘటించ బూనుకున్నారు. అందుచేత, రాజ్యాంగ ముసాయిదా యిలా అంటున్నది: "పెట్టుబడిదారు ప్రజాక్షేమానికి భంగం కలిగించరాదని, సాంఘిక, ఆర్థిక వ్యవస్థను కల్లోలపరచరాదని, చట్టవిరుద్ధమైన చర్యలతో జాతీయ ఆర్థిక ప్రణాళికకు విఘాతం కల్పించరాదని మన రాజ్యాంగ యంత్రం నిర్దేశిస్తున్నది."

మన దేశంలో ఇప్పుడు వర్గపోరాటమే లేదనడం తప్పు. చట్టవిరుద్ధమైన, విచ్ఛిన్నకరమైన కార్యకలాపాలు సాగించే పెట్టుబడిదారులను శిక్షించాలి. పెట్టుబడిదారీ దోపిడీని పరిమితంచేసే దశనుంచి పూర్తిగా నిర్మూలించే దశకు పరివర్తన చెందడంలో క్లిష్టమైన వర్గపోరాటం తప్పనిసరి అవుతుంది. అయితే ఈ లక్ష్యాన్ని శాంతియుత పోరాటంతో సాధించవచ్చు. అంటే, పరిపాలనాయంత్రాన్ని అదుపులో వుంచుకోవడం ద్వారా, ప్రభుత్వ యాజమాన్యంలోని ఆర్థికరంగం నాయకత్వం ద్వారా, కార్మిక ప్రజానీకంపై పర్యవేక్షణద్వారా ఇది సాధ్య మవుతుంది. పెట్టుబడిదారు కాలగతిని గ్రహించి, సోషలిస్టు మార్పులను అంగీకరించితే చట్టవిరుద్ధంగా ప్రవర్తించక ప్రజల ఆస్తులను ధ్వంసంచేయక మసలుకుంటే, ప్రభుత్వం అతని

యోగక్షేమాలపట్ల శ్రద్ధ వహిస్తుంది. అతని భవిష్యత్ జీవితానికి తగు ఏర్పాట్లు చేస్తుంది. అతని రాజకీయ హక్కులకుకూడా లోపం కలుగదు. దీనికీ, ఫ్యూడల్ భూస్వామికవర్గంపట్ల మన విధానానికీ చాలా తేడా వుంది. మన రాజ్యాంగ యంత్రానికి కార్మికవర్గ నాయకత్వం, కార్మిక కర్షక దృఢ ఐక్యత, జాతీయ ఆర్థిక వ్యవస్థలో సోషలిస్టు రంగంయొక్క నాయకత్వస్థానం, దేశంలోనున్న ఐక్యసంఘటన, వీటితోపాటు అనుకూలమైన అంతర్జాతీయ పరిస్థితులు ఇవన్నీ మన దేశం శాంతియుతంగా దోపిడీని నిర్మూలించడానికి, సోషలిస్టుసమాజాన్ని నిర్మించడానికి దోహదం చేస్తాయి.

జాతీయ మైనారిటీలు నివసించే ప్రాంతాలలో సోషలిస్టు మార్పులు ప్రవేశపెట్టే విషయంలో, ఆయా అల్పసంఖ్యాక జాతుల అభివృద్ధిలోనున్న ప్రత్యేకతలను గుర్తించాలి. ఈ విషయాన్ని తర్వాత వివరిస్తాను.

ఇక ధనికరైతు సమస్య తీసుకుందాం. రాజ్యాంగ ముసాయిదాపై దేశవ్యాప్తంగా చర్చ జరిగినపుడు, పలువురు ఇలా ప్రశ్నించారు: "ధనికరైతు ఆర్థికవ్యవస్థను పరిమితంచేసి, క్రమంగా రద్దుపరచుట ఆ సమస్యపట్ల ప్రభుత్వ విధానమని రాజ్యాంగ ముసాయిదా చెబుతున్నది. దీని అర్థమేమిటి?"

ధనిక రైతు వ్యవస్థ గ్రామీణ ప్రాంతాలలో పెట్టుబడిదారీ వ్యవస్థతో సమానమని మా అభిప్రాయం. ధనికరైతులు గ్రామీణ ప్రాంతాలలో దోపిడీవర్గ అవశేషాలు. మన దేశంలో ధనికరైతు ఆర్థిక వ్యవస్థ ఇంకా బాగా అభివృద్ధిచెందలేదు. ధనికరైతులు కౌలుకిచ్చిన భూమి భూసంస్కరణాల కాలంలో

తిరిగి పంచబడింది. ఈ సంస్కరణల తర్వాత, ఉత్పత్తిదారుల సహకార సంఘాలు, సప్లయి, మార్కెటింగ్ సహకార సంఘాలు, పరపతి సంఘాలు, అభివృద్ధి చెందాయి. ఆహార ధాన్యాలను, ఇతర వ్యవసాయ సరకులను ప్రభుత్వమే కొని పంపకం చేస్తున్నది. ఇందువల్ల ధనికరైతు వ్యవస్థ చాలావరకు పరిమితమైంది. కొత్తతరగతి ధనికరైతులు కొద్దిమంది గ్రామాలలో తలెత్తినప్పటికీ, మొత్తంమీద ధనికరైతు ఆర్థికవ్యవస్థ పెరగలేదు; క్షీణించింది. ఇప్పుడు ధనికరైతు కమతం సగటున సామాన్యరైతు కమతానికి రెండింతలుంటే ఎక్కువ. ఇదివరలో జీతాలకు కూలీలను నియోగించే ధనికరైతు లనేకమంది ఇప్పుడు దానికి స్వస్తిచెప్పారు; లేదా చాల చాల అరుదుగా కూలీలను పెట్టుకొంటున్నారు. వడ్డీవ్యాపారం చేసేవారు తగ్గిపోతున్నారు. వ్యాపారం చేసేవారుకూడ పరిమితమైనారు. అందుచేత మన దేశంలో, గ్రామీణ ప్రాంతాలలో సహకారసంఘాల నిర్మాణం ద్వారా, ధనికరైతు ఆర్థికవ్యవస్థను పరిమితంచేయడం ద్వారా క్రమంగా పెట్టుబడిదారీ విధానాన్ని నిర్మూలించడం సాధ్యమవుతుంది. ఏది ఏమైనా పోరాటం అనివార్యం. ధనికరైతుల విచ్ఛిన్నకరచర్యలను విస్మరించరాదు. అనేక ప్రాంతాలలో, ప్రభుత్వప్రధాన్యం కొనుగోలు పంపకాలను ధనికరైతులు ప్రతిఘటించారు. పరస్పర సహాయ సహకారోద్యమానికి విఘాతాలు కల్పించారు. విచ్ఛిన్నచర్యలు చేసే ఇలాంటి ధనికరైతులను తప్పక శిక్షించాలి. అయితే ప్రస్తుత రాజకీయ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా, ధనికరైతులను తొలగించడానికి భూసంస్కరణల కాలంలోవలె ప్రత్యేకోద్యమం అవసరంలేదు. భవిష్య

త్తులో, దోపిడీని విడనాడిన ధనికరైతులను కొన్ని షరతులపై సహకార సంఘాలలో చేర్చుకొని, వారి సంస్కరణకు అవకాశ మివ్వవచ్చు. అయితే అంతకుముందే వ్యవసాయోత్పత్తిదారుల సహకార సంఘాలను సంఘటితం చేసివుండాలి. ధనికరైతుల సభ్యత్వానికి ఇతర రైతుల అంగీకారాన్ని సంపాదించాలి.

రాజ్యాంగ ముసాయిదాపై దేశమంతటా చర్చసాగిన సందర్భంలో ఎంతోమంది అడిగారు: "చట్టం ప్రకారం ఉత్పత్తి సాధనాలపై పెట్టుబడిదారీ యాజమాన్యాన్ని, ఇతర పెట్టుబడులను ప్రభుత్వం రక్షిస్తుందని రాజ్యాంగ ముసాయిదా చెబుతోంది. మరోవైపు పెట్టుబడిదారీ వాణిజ్యపరిశ్రమలలో, ప్రభుత్వం సోషలిస్టుమార్పులు ప్రవేశపెడుతుందని, పెట్టుబడిదారీ యాజమాన్యంస్థానంలో క్రమంగా మొత్తం ప్రజాసామాన్యపు యాజమాన్యాన్ని స్థాపిస్తుందని చెబుతున్నది. ఇది పరస్పర విరుద్ధం కాదా!"

ఈ వైరుధ్యాలేవైనా వాస్తవిక జీవితంలోని వైరుధ్యాలనే ప్రతిబింబిస్తున్నవి. పరివర్తనదశలో మన దేశంలో సోషలిజమేగాక, పెట్టుబడిదారీ విధానంకూడా వున్నది. ఈ రెండు విధాలైన యాజమాన్యాల మధ్యనున్న వైరుధ్యం సహజ సిద్ధంగానున్న వైరుధ్యమే. ప్రస్తుతదశలో జాతిక్షేమానికి, ప్రజాజీవనానికి లాభదాయకమైన కొన్నిగుణాలు పెట్టుబడిదారీ వాణిజ్య పరిశ్రమలలో నున్నవి. కాగా, ప్రజలకు మేలు చేయని గుణాలుకూడా వాటిలో ఉన్నవి. ఇందులోనే వైరుధ్యం వుంది. అంటే పెట్టుబడిదారీ వాణిజ్య, పరిశ్రమల అస్తిత్వంలోనే వైరుధ్యం వుంది. సోషలిజానికీ, పెట్టుబడిదారీవిధానానికీ గల

వైరుధ్యాన్ని ఎలా పరిష్కరిస్తామంటే, పెట్టుబడిదారీ యాజమాన్యాన్ని అనుమతించుతాం; పెట్టుబడిదారీ వాణిజ్య, పరిశ్రమల్లో ప్రజాక్షేమానికి తోడ్పడే గుణాలను ఉపయోగించుకుంటాం; అలా తోడ్పడని గుణాలను పరిమితం చేస్తాం. పెట్టుబడిదారీ యాజమాన్యంస్థానే క్రమంగా ప్రజల యాజమాన్యం నెలకొల్పడానికి తగిన పరిస్థితులు కల్పించేందుకుగాను పరివర్తన రూపాలు ప్రవేశపెడతాం. సోషలిస్టుసమాజానికి పరివర్తన చెందడం విషయమై, ముసాయిదాలో పేర్కొనబడ్డ కొన్ని చర్యలు ఈవైరుధ్యాన్ని సరిగా పరిష్కరించడానికే ఉద్దేశించబడినవి.

మనదేశ వాస్తవిక పరిస్థితులలో సోషలిజం నిర్మాణానికి మనం అవలంబించే విధానాలు సరియైనవే. మన శత్రువుల ఆందోళన, విదేశ పెట్టుబడిదారీ పత్రికలలో వ్యాఖ్యానాలు ఈ విషయాన్నే రుజువు చేస్తాయి.

సామ్రాజ్యవాదులు, తైవాన్‌లోని విద్రోహ చాంగ్ ముఠా మనం చైనాలో సోషలిజం నిర్మించడాన్ని ఇష్టపడవు. వారు రోజూ మనపై దుష్ప్రచారం సాగిస్తున్నారు. అందులో ఆశ్చర్య మేమీలేదు. మనం సరియైనమార్గాన నడవడమే అందుకు కారణం.

ముసాయిదాలో పొందుపరచిన విధంగా మనం అనుసరించేమార్గం "సోవియట్ యూనియన్ నడచిన మార్గమే"నని విదేశాలలో కొన్ని పెట్టుబడిదారీ పత్రికలు వాపోతున్నాయి. నిజమే. మనం అనుసరించబోయే మార్గం సోవియట్ నడచిన మార్గమే. ఈ విషయంలో మనకు ఏమాత్రం సందేహం లేదు.

సోవియట్ మార్గం చారిత్రక పరిణామ సూత్రాల ప్రకారం మానవజాతి అంతా ఎప్పటికైనా అనుసరించే మార్గమే. ఈ బాటను విడనాడటం అసాధ్యం. మార్క్సిజం - లెనినిజం విశ్వానికంతటికీ వర్తించే సత్యమని మనం ఎల్లప్పుడూ నమ్ముతూ వచ్చాం.

మన సోషలిజం నిర్మాణమార్గాన్ని విచ్ఛిన్నం చేసేందుకుగాను, మోసకారులైన మన శత్రువులు కొంతమందిని నియోగించారు. వీరు ట్రాట్స్కీవాదులవలె, చెన్-టూ-శ్యూ వాదులవలె "వామపక్ష వాదులుగా" నటిస్తారు. కాని, సోషలిజం నిర్మాణానికి మనం తీసుకునే చర్యలను ప్రతిఘటిస్తారు. మనం "కఠినమైన చర్యలు" తీసుకోడంలేదని, అదేపనిగా "రాజీ పడుతున్నామని", "మార్క్సిజాన్ని విడనాడామని" వారంటారు. ఇలాంటి అర్థంలేని వాగుడుతో వారు ప్రజలను గందరగోళపరచ చూస్తారు. జాతీయ బూర్జువావర్గంతో మనం సంబంధాలు తెంచివేసుకుని, వారిని తక్షణం బికారులుగా చేయాలని సూచిస్తారు. మన వ్యావసాయిక విధానంకూడా "మందగతితో" నడుస్తున్నదని వారు ఆరోపిస్తారు. రైతులతో ఐక్యతను విచ్ఛిన్నం చేసుకోవాలని కోరుతారు. ఇలాంటి అభిప్రాయాలు అర్థంలేనివాగుడుకాక మరేమిటి? మనం వారుచెప్పినట్లు చేస్తే, సామ్రాజ్యవాదులు, విద్రోహి చాంగ్-కై-షేక్ మాత్రమే సంతోషిస్తారు.

చైనాప్రజలు సోషలిజం నిర్మాణాన్ని లక్ష్యంగా పెట్టుకోడమే గాక, అందుకు స్పష్టమైన చర్యలనుకూడా రూపొందించుకున్నారు. ఇది సహజంగా మన శత్రువులకు మిక్కిలి

అసంతృప్తి కలిగిస్తుంది. అయితే ఒక విషయం స్పష్టం. మన శత్రువులు దేనినైతే మిక్కిలిగా ద్వేషిస్తారో, అది చైనా ప్రజలకు అత్యంత ప్రయోజనకారి అవుతుంది.

3. మన నూతన ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థ; ప్రజల హక్కులు, బాధ్యతలు :

రాజ్యాంగ ముసాయిదాలో రెండవ ఆర్టికల్ ఇలా చెబుతున్నది: "చైనా ప్రజారిపబ్లిక్‌లో అధికారమంతా ప్రజలదే. జాతీయ ప్రజా ప్రతినిధుల సభద్వారా, అన్నిస్థాయిలలో స్థానిక ప్రజా ప్రతినిధుల సభలద్వారా, ప్రజలు ఈ అధికారాన్ని చలాయిస్తారు." ఈ అంశం, ఇతర ఆర్టికల్సులోని అంశాలు ఈ ప్రజా ప్రతినిధుల సభలో మనదేశ రాజకీయ వ్యవస్థయని స్పష్టం చేస్తున్నాయి. మన ప్రజా విప్లవోద్యమ స్థావరాలలో దీర్ఘకాల రాజకీయ నిర్మాణానుభవందృష్ట్యా సోవియట్‌యూనియన్, నూతన ప్రజాస్వామ్యదేశాల ప్రజల అనుభవాలదృష్ట్యా ఐదు సంవత్సరాలక్రితం మన ఉమ్మడి కార్యక్రమం మనదేశానికి ఈవిధమైన రాజకీయవ్యవస్థ అవసరమని నిర్ణయించింది. ఇపుడు గత ఐదుసంవత్సరాలలో మన ప్రభుత్వయంత్రం అనుభవాన్ని, అన్ని సర్కిల్స్‌లో ప్రజా ప్రాతినిధ్య సమావేశం అనుభవాన్ని దృష్టిలోపెట్టుకుని, ముసాయిదా రాజ్యాంగం మనదేశ రాజకీయవ్యవస్థను సమగ్రంగా మరింత నిర్వచించింది. ఈ రాజకీయవ్యవస్థ మన రాజ్యాంగయంత్రం యొక్క మూలస్వభావంతో ముడిపడివుంది. సోషలిజంవైపు మనదేశ పురోగమనాన్ని నిరాటంకంగా సాగించేదుకు, యీ రాజకీయ వ్యవస్థనే మనం ఏర్పరుచుకుంటున్నాం.

ప్రజాప్రతినిధుల సభలు మన దేశానికి సరియైన రాజకీయ వ్యవస్థ నేర్పాటుచేస్తాయి. ఎందుచేతంటే, ప్రజలు తమ అధికారం చెలాయించడానికి, ప్రభుత్వ నిర్వహణలో నిరంతరం పాలు పంచుకోడానికి, తద్వారా తమ చొరవను, సృజనాత్మక శక్తిని సద్వినియోగంచేయడానికి ఇవి అవకాశం కలిగిస్తాయి. రాజ్యాంగయంత్ర నిర్వహణలో ప్రజలు తమ శక్తిసామర్థ్యాలను వినియోగించడానికి అవకాశమిచ్చే రాజకీయవ్యవస్థ లేకపోతే, సోషలిజం నిర్మాణానికి వారిని సమీకరించలేము.

మన ప్రజాప్రతినిధుల సభలు సార్వజనీన ఓటింగు హక్కుపై ఏర్పడ్డాయి. 18 సంవత్సరాలు వచ్చిన పౌరులందరూ జాతి, లింగ, వృత్తి, సాంఘిక హోదా, మత విశ్వాసము, విద్యాస్థాయి, ఆస్తి, నివాస పరిమితులతో నిమిత్తం లేకుండా ఓటు చేయవచ్చు; ఎన్నుకోబడవచ్చునని రాజ్యాంగ ముసాయిదా చెబుతోంది. మన దేశంలో నేడున్న పరిస్థితులలో, చట్టం ప్రకారం, ఫ్యూడల్ భూస్వాములకు, బ్యూరాక్రటిక్ పెట్టుబడిదారులకు కొంతకాలంపాటు ఓటుచేయడానికి, ఎన్నుకోబడటానికి హక్కులు లేకుండా చేసే అవసరం; ఇత జనాభాకు ఇంతమంది ప్రతినిధులను ఎన్నుకోవాలనే నిష్పత్తిని నగరాలకు, గ్రామాలకు మధ్య భేదం పాటిస్తూ నిర్దేశించవలసిన అవసరం; అనేక స్థాయిలలో ఎన్నికల పద్ధతిని, అత్యంత ప్రాథమిక ఎన్నికలలో చేతులెత్తే ఎన్నికల పద్ధతిని ప్రవేశపెట్టవలసిన అవసరం ఇంకా ఉన్నది. మన ఎన్నికల పద్ధతి క్రమంగా అభివృద్ధి చేయబడుతుంది. పరిస్థితులు పరిపక్వమైనప్పుడు, పరిపూర్ణమైన, సార్వజనీన, సమాన, ప్రత్యక్ష, రహస్య ఎన్నికల విధానాన్ని

మన దేశం అనుసరిస్తుంది. ప్రస్తుత ఎన్నికల విధానం, ప్రస్తుత పరిస్థితులకు తగినట్టిది. ప్రజలకు అత్యంత సౌకర్యమైనదికూడా. ఈ పద్ధతి జాతీయ అల్పసంఖ్యాకవర్గాలను, వివిధ ప్రజాతంత్ర వర్గాలను దృష్టిలో పెట్టుకుని, వారి ప్రాతినిధ్యానికి, తగినట్టు ప్రతినిధుల సంఖ్యను నిర్ణయించింది. ఇలాంటి ఎన్నికలద్వారా ఏర్పడిన ప్రజాప్రతినిధుల సభలు ప్రజావాంఛలను ప్రతిబింబిస్తాయి. ఆవిధంగా ఉన్నత ప్రజాస్వామ్య స్వరూపంగల ప్రజాప్రాతినిధ్య సంస్థలవుతాయి.

మన రాజ్యాంగ ముసాయిదా ప్రకారం, ఉన్నత ప్రభుత్వాధికారం జాతీయ ప్రజాప్రతినిధులసభ చేతిలో వుంది. రాజ్య పరిపాలనా సంస్థలన్నీ, స్టేట్ కౌన్సిల్‌నుండి స్థానిక ప్రజా కౌన్సిళ్ళవరకూ, ప్రభుత్వాధికారం చెలాయించే సంస్థలనుండి ఏర్పర్చబడ్డాయి. అవే వాటిని పర్యవేక్షిస్తాయి. అనగా జాతీయ ప్రజా ప్రతినిధులసభ, స్థానిక ప్రజా ప్రతినిధుల సభలు ఈ అధికారం చెలాయిస్తాయి. పరిపాలనా సంస్థలను తొలగించడానికి ఈ ప్రజా ప్రతినిధుల సభలకు హక్కు వున్నది. అందుచేత, రాజ్య పరిపాలనాసంస్థలు ఎట్టి పరిస్థితులలోనూ, ప్రజాప్రతినిధుల సభలను విడిచి స్వతంత్రంగా గాని, ప్రజా ప్రతినిధుల సభల అభీష్టాలకు విరుద్ధంగా గాని వ్యవహరించడానికి వీల్లేదు. మన దేశంలో రాజ్యాధిపతి కర్తవ్యాలను, అధికారాలను జాతీయ ప్రజా ప్రతినిధుల సభాస్థాయీసంఘం, చైనా ప్రజా రిపబ్లిక్ అధ్యక్షుడు సంయుక్తంగా నిర్వహిస్తారు. ఈ స్థాయీ సంఘాన్ని ప్రజాసభ ఎన్నుకుంటుంది. ఇది మన దేశ పరిస్థితులకు తగినట్టిది. ప్రజా రిపబ్లిక్ స్థాపన కాలంనుంచీ, రాజ్యాధికారాన్ని

చెలాయించే అత్యున్నతసంస్థల నిర్మాణంలో మన అనుభవం దీనికి ప్రాతిపదిక. మన రాజ్యాధిపతిని సమష్టి నాయకత్వంగా పేర్కొనవచ్చు. స్థాయీసంఘానికి గాని, ప్రజారిపబ్లిక్ అధ్యక్షు నికి గాని, జాతీయ ప్రజాసభ అధికారాలకు మించిన అధికారాలు లేవు.

ముఖ్యమైన మన ప్రభుత్వ వ్యవహారాలను ఏ ఒక వ్యక్తి గాని, కొద్దిమంది వ్యక్తులుగాని నిర్ణయించడానికి వీలులేదు. ప్రజాసభలను ప్రాథమిక రాజకీయవ్యవస్థగా నిర్మించినందున, ముఖ్యసమస్య లన్నింటినీ వాటి నిర్ణయానికి సమర్పించాలి. దేశానికంతటికీ సంబంధించిన ప్రధాన సమస్యలను జాతీయ ప్రజాసభగాని, ప్రజాసభ సమావేశంలో లేనపుడు స్థాయీ సంఘంగాని చర్చించి నిర్ణయించాలి. స్థానికంగా ముఖ్యమైన సమస్యలను స్థానిక ప్రజాసభలు చర్చించి నిర్ణయించాలి. ఆవిధంగా, మన ప్రజాసభలు రాజ్యాధికారాన్ని నిర్వహించే సంస్థలు. ముఖ్యమైన సమస్యలపై అవి నిర్ణయాలు చేసి, వాటి అమలును పర్యవేక్షిస్తాయి.

రాజ్యాంగ ముసాయిదా 2వ ఆర్టికల్‌లో 2వ పేరా ఇలా చెబుతోంది: "జాతీయ ప్రజాసభ, స్థానిక ప్రజాసభలు, ఇతర రాజ్యాంగయంత్ర ఉపాంగాలు, ఎట్టి మినహాయింపూ లేకుండా, కేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని అనుసరిస్తాయి." ప్రభుత్వాధికారం నిర్వహణ ప్రజాసభల చేతులలో కేంద్రీకృతం కావడం మన కేంద్రీకృత ప్రజాస్వామ్య పద్ధతిని వివరిస్తుంది. హాంకాంగ్‌లో వెలువడిన ఒక అభివృద్ధి నిరోధక ప్రచురణ ఇలా వ్రాసింది: "ఈ ప్రజాసభల పద్ధతి అధికార కేంద్రీకరణలో

పరాకాష్ఠను సూచిస్తుంది." మనపై దుమ్మెత్తిపోయడానికి తమ కేదో సాధనం దొరికిందని ఈ అభివృద్ధినిరోధకులు భావిస్తున్నట్టుంగా. అయితే మనం మార్క్సిస్టు - లెనినిస్టు వాదులం కేంద్రీకృతాధికారాన్ని కోరుతామని ఏనాడో ప్రకటించాం. అయితే అది ఏవిధమైన కేంద్రీకరణ? కొద్దిపాటి బడా ఫ్యూడల్ భూస్వాముల, పెట్టుబడిదారుల నిరంకుశ కేంద్రీకృతాధికారమా? లేక కార్మికవర్గ నాయకత్వాన జన బాహుళ్యం చెలాయించే కేంద్రీకృత ప్రజాస్వామ్యమా? ఈ రెండు విధాలైన కేంద్రీకరణలకు ఆకాశానికి భూమికి వున్నంత వ్యత్యాసం వుంది. రాజ్యాంగ ముసాయిదాలో అత్యున్నత కేంద్రీకరణను, అత్యున్నత ప్రజాస్వామ్యంతో జోడించాం. మన రాజకీయ వ్యవస్థలో అత్యున్నత కేంద్రీకరణ వున్నది. కాని అది అత్యున్నత ప్రజాస్వామ్యంపై ఆధారపడింది.

ప్రజలు ఒకరి చేతికింద అణగారిపోతున్నపుడు తమ అభీష్టాలను, బలాన్ని పూర్తిగా కేంద్రీకరించజాలరు. అందు చేతనే, చైనా ప్రజలు "ఇసుకలాంటి"వారని గతంలో అవ హేళన పాలయ్యారు. విప్లవం ప్రజావాంఛలను, శక్తిని కేంద్రీ కరించింది. విముక్తమై, తమ రాజ్యాన్ని స్థాపించుకొన్న తర్వాత, ప్రజలు రాజ్యాంగ యంత్రాన్ని నిర్మించడంపై తమ శక్తిని, ఆత్మబలాన్ని కేంద్రీకరించారు. దానిని బలవత్తరమైన ఆయుధంగా రూపొందించారు. ప్రజల రాజ్యాంగయంత్రం ఎంత శక్తివంతంగా వుంటే అది అంతశక్తివంతంగా ప్రజాప్రయోజ నాలను, ప్రజాతంత్రహక్కులను రక్షించగలుగుతుంది. సోషలిజం నిర్మాణానికి హామీ ఇవ్వగలుగుతుంది.

"మిశ్రమ ప్రభుత్వం" అనే గ్రంథంలో మన దేశ రాజకీయ వ్యవస్థను చర్చిస్తూ కామ్రేడ్ మావ్ - సే - టుంగ్ ఇలా స్పష్టంచేశాడు: "మన రాజకీయ వ్యవస్థ ప్రజాస్వామ్యమైనదీ, కేంద్రీకృతమైనదీకూడా. అంటే, ప్రజాస్వామ్య ప్రాతిపదికపై కేంద్రీకృతమైనది. కేంద్రీకృత నాయకత్వంక్రింద ప్రజాస్వామ్య బద్ధమైనది." ఇదే మన సిద్ధాంతం.

ప్రజాస్వామ్యమూ, కేంద్రీకృతాధికారమూ, పరస్పర విరుద్ధమైన విషయాలని, వాటిని జోడించడానికి వీలులేదని పలువురు అభిప్రాయపడతారు. అది సరికాదు. ప్రజాస్వామ్యం వున్నచోట కేంద్రీకరణ వుండదని, కేంద్రీకరణ వున్నచోట ప్రజాస్వామ్యం వుండదని వారు భావిస్తారు. మనప్రభుత్వ ఉపాంగాలలో రాజకీయ ఏకాభిప్రాయాన్ని, దేశమంతటా సమైక్య నాయకత్వాన్ని చూచినపుడు, ఇక్కడ "ప్రజాస్వామ్యం లేదు" అని నిరూపించ ప్రయత్నిస్తారు. వారితో వచ్చిన పేచీ ఏమంటే వారికి నూతన ప్రజాతంత్రం అవగాహన కాదు. అందుచేత నూతన ప్రజాతంత్ర ప్రాతిపదికపై కేంద్రీకరణ అంటే ఏమిటో వారికి తెలీదు.

ప్రజాసభలయొక్క, ఇతర ప్రభుత్వ ఉపాంగాలయొక్క కార్యకలాపాలకు, ప్రజల ఉమ్మడి ప్రయోజనాలు, వారి సమైక్య అభీష్టం ప్రాతిపదికలు. అందుచేత, ప్రభుత్వ ఉపాంగాలలో ప్రజాస్వామ్య ప్రాతిపదికపై, రాజకీయ ఏకాభిప్రాయానికి రావటం సాధ్యం. అయితే రాజకీయ ఏకాభిప్రాయమంటే, విమర్శ, ఆత్మవిమర్శలను తగ్గించడంకాని, తొలగించడంకాని కానేరదు. కాగా, విమర్శ, ఆత్మవిమర్శ మన ప్రజాతంత్ర

జీవితంలో ప్రధానమైన అంశం. మన దేశంలో ప్రభుత్వోపాంగా లన్నింటి కార్యకలాపాలలో, తప్పులు, లోపాలు జరగడం అనివార్యం. అందుచేత జాతీయ ప్రజాసభ సమావేశాలలో, స్థానిక ప్రజాసభలలో, ఉపాంగాల సమావేశాలలో, దైనందిన కార్యకలాపాలలో విమర్శకు, ఆత్మవిమర్శకు పూర్తి అవకాశ ముండాలి. ప్రభుత్వ ఉపాంగాల కార్యకలాపాలను ముందుకు తీసుకుపోడానికి, విమర్శ, ఆత్మవిమర్శ ఆయుధాన్ని ఉపయో గించి లోపాలను, తప్పులను సరిదిద్దాలి. ప్రజలనుంచి వేరు పరచే బ్యూరాక్రటిక్ ధోరణులను ప్రతిఘటించాలి. ఆవిధంగా, ప్రభుత్వ ఉపాంగాలు ప్రజలతో నిరంతరం, సన్నిహిత సంబంధా లుంచుకోడానికి, వారి అభీష్టాన్ని సరిగా ప్రతిబింబించడానికి వీలుకలిగించాలి. విమర్శ ఆత్మవిమర్శ సమగ్రంగా లేకపోతే, ప్రజల రాజకీయ సమైక్యత సాధ్యమూ కాదు. దానిని నిలుపు కోడమూ వీలుపడదు. మన ప్రభుత్వ ఉపాంగాలలో విమర్శను నొక్కివేయడం చట్టరీత్యా నేరం.

బూర్జువాదృక్పథంనుంచి మన రాజకీయ వ్యవస్థను అర్థం చేసుకోడం సాధ్యంకాదు. మన రాజ్యాంగ ముసాయి దాలో నిర్వచించబడ్డ రాజకీయ వ్యవస్థపై అనేక విదేశ బూర్జువా పత్రికలు వ్యాఖ్యానించాయి. ప్రజాసభల విస్తృ తాధికారాలకు కొందరు ఆశ్చర్యం వెలిబుచ్చారు.

"జాతీయ ప్రజాసభ కర్తవ్యాలు, అధికారాలు ఇంత విస్తృతంగా వుండటం ఎవరికైనా ఆశ్చర్యం గొల్పక మానదు" అని వారన్నారు. చైనా ప్రజారిపబ్లిక్ అధ్యక్షుని అధికారాలు ఫ్రెంచి అధ్యక్షుని అధికారాలను పోలుతాయూ, అమెరికన్

అధ్యక్షుని అధికారాలను పోలుతాయా అని ఇంకా కొందరు కుస్తీపడుతున్నారు. ఈ వ్యాఖ్యాతలు మన విధానాన్ని బూర్జువా దేశాల రాజకీయవ్యవస్థతో పోల్చిచూడ యత్నిస్తారు. లేక, తమ ఊహాగానంపై ఆధారపడి ఏవో ప్రకటనలు చేస్తుంటారు. శోచనీయమైన విషయమేమంటే, వారు అన్నింటికంటె ముఖ్యమైన 'ప్రాథమికమైన విషయాన్ని గుర్తించరు. చైనా చరిత్రలో సంభవించిన బ్రహ్మాండమైన మార్పులను వారు గమనించరు. కార్మికవర్గ నాయకత్వాన చైనా ప్రజలు తమదేశానికి కర్తలైనారన్నదే ఆమార్పు.

మరికొందరు విదేశ బూర్జువా వ్యాఖ్యాతలు మన కేంద్రీకృత ప్రజాస్వామ్య వ్యవస్థను, ప్రజల సమష్టి మనో నిశ్చయాన్ని నిరశిస్తారు. ఈకారణాలవల్ల మనదేశంలో "వ్యక్తి స్వాతంత్ర్యం లేదని", మనం వ్యక్తిగత ప్రయోజనాలను విస్మరిస్తామని" వారు ఆరోపిస్తారు. అందుచేత, ఉన్నత కేంద్రీకృత ప్రజాస్వామ్యం ప్రజల సమష్టి మనోనిశ్చయం, ప్రజల వ్యక్తిగత ప్రయోజనాలను, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని రూపుమాపుతాయా అనే సమస్యపై నేను కొద్దిగా చెబుతాను.

రాజ్యాంగంలోని వివిధ ఆర్టికల్సు మన పౌరులకు అనేక హక్కులు కల్పిస్తున్నాయి. రాజ్యాంగ ముసాయిదా వాక్, సభా, పత్రికా, సంఘ స్వాతంత్ర్యాలను, ఊరేగింపు, ప్రదర్శనా స్వేచ్ఛలను కల్పిస్తున్నది. పౌరులు ఈ స్వాతంత్ర్యాలను అనుభవించడానికిగాను, ప్రభుత్వం తగు భౌతిక సౌకర్యాలు కలిగించాలని నిర్దేశిస్తున్నది. ముసాయిదా ఇంకా ఇలా ప్రకటిస్తున్నది: "పౌరుల వ్యక్తిగత స్వాతంత్ర్యానికి ఎవ్వరూ భంగం కలిగించ

వీలులేదు. కోర్టునిర్ణయంగాని, పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఆమోదం గాని లేకుండా ఎవ్వరినీ అరెస్టుచేయరాదు."

"పౌరుల గృహాలలోకి ఎవ్వరంటేవారు ప్రవేశించ వీలు లేదు. ఉత్తర ప్రత్యుత్తరాలలో గోప్యానికి చట్టం రక్షణ ఇస్తోంది" అని, "పౌరులకు నివాస స్వాతంత్ర్యం వున్నది" అని కూడా ముసాయిదా స్పష్టంచేస్తున్నది. పౌరులకు పనిచేసే హక్కు, విద్యాహక్కు వున్నవని, కష్టజీవులకు ముసలితనంలో, జబ్బులో, అశక్తత సమయంలో విశ్రాంతికి, ఆర్థిక సహాయానికి హక్కుఉన్నదని ముసాయిదా తెలుపుతున్నది. అంతేకాదు. పౌరులు ఈ హక్కులు అనుభవించడానికి అవసరమైన భౌతిక పరిస్థితులను క్రమక్రమంగా, ప్రభుత్వం విస్తృతపరుస్తుందని కూడా రాజ్యాంగం చెబుతున్నది. పౌరులకు మత స్వాతంత్ర్యం వుందనికూడా ముసాయిదా పేర్కొంటున్నది. మన రాజ్యాంగ యంత్రం ప్రతి ఒక్క పౌరుని స్వాతంత్ర్యాలను, హక్కులను గ్యారంటీ చేయగలుగుతున్నది. మన దేశంలోని రాజ్యాంగ వ్యవస్థ, సాంఘిక వ్యవస్థ దీనిని సాధ్యంచేశాయి. మన ప్రజలు అనుభవించేటంత వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఏ పెట్టుబడిదారీ దేశ ప్రజలూ అనుభవించడంలేదు. అనుభవించ లేరుకూడా.

ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను, హక్కులను సంరక్షించడానికి ప్రయత్నిస్తూనే, మరొకవైపు, దేశద్రోహ, విప్లవ ప్రతీఘాతకచర్యలను అణచివేయడం, అలాంటి చర్యలు జరిపేవారిని శిక్షించడం కొంతమంది విదేశ వ్యాఖ్యాతలకు విస్మయం కలిగిస్తున్నది. నిజమే. దేశద్రోహులకు విప్లవ ప్రతీఘాతకులకు, మన రాజ్యాంగం రక్షణ కల్పించాలని ఉద్దేశించే

వారు, తప్పక ఆశాభంగం చెందుతారు. ఇక మనల్ని దాస్య బంధనాలలో ఇరికించ చూసే విదేశ సామ్రాజ్యవాదులకు, వారి తాబేదారులకు మనరాజ్యాంగం, మనచట్టాలు ఏమాత్రం అవకాశం ఇవ్వవు. దేశద్రోహులకు, విప్లవ ప్రతీఘాతకులకు, స్వేచ్ఛను అరికట్టినందువల్లనేకదా, ప్రజలకు నిజమైన స్వాతంత్ర్యం లభించింది?

మనపౌరుల మత స్వాతంత్ర్యాన్ని రక్షిస్తూ, మరొకవైపు మతం ముసుగులో విప్లవ ప్రతీఘాతకచర్యలు జరిపే సామ్రాజ్యవాద మూకలను, దేశద్రోహులను మనం శిక్షించడంకూడా కొందరు విదేశీ వ్యాఖ్యాతలకు ఆశ్చర్యం కలిగిస్తుంది. నిజమే. చైనా ప్రజల అధికారానికి వ్యతిరేకంగా, విద్రోహచర్యలు సాగించే సామ్రాజ్యవాద వర్గాలకు, దేశద్రోహులకు మనం రక్షణ ఇస్తామని భావించేవారు ఆశాభంగం చెందితీరుతారు. మన రాజ్యాంగ ముసాయిదాలో పొందుపరచినట్లు మన ప్రభుత్వం ఇదివరలోవలె ఇకమీదట పౌరుల మత స్వాతంత్ర్యాన్ని కాపాడుతుంది. అయితే, మత స్వాతంత్ర్య రక్షణవేరు. విప్లవ ప్రతీఘాతకులరక్షణ వేరు. ఈ రెంటికీ సంబంధమే లేదు. అదేవిధంగా, మతం ముసుగుతో విప్లవప్రతీఘాతకచర్యలు జరిపేవారికి మన రాజ్యాంగం, చట్టాలు ఎట్టి సౌకర్యమూ ఇవ్వవు. ఈ విషయం అర్థంచేసుకోవడం కష్టమేమీకాదు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో రాజ్యాంగయంత్రం అత్యల్పమైన దోపిడీవర్గంయొక్క ప్రయోజనాలను, స్వేచ్ఛను మాత్రమే రక్షిస్తుంది. అత్యధిక సంఖ్యాక ప్రజల స్వేచ్ఛను హరిస్తుంది.

మన దేశంలో పరిస్థితులు అందుకు పూర్తిగా భిన్నం, కొద్ది మంది వ్యక్తుల ప్రయోజనాలకోసం, స్వేచ్ఛకోసం, అత్యధిక సంఖ్యాక ప్రజల ప్రయోజనాలనుగాని, స్వేచ్ఛనుగాని, దేశం యొక్క, సంఘంయొక్క ప్రయోజనాలనుగాని ఎవ్వరూ భంగం కలిగించడాన్ని మనం అనుమతించం. ఇందువల్లనే రాజ్యాంగ ముసాయిదాలో 14 వ ఆర్టికల్ ఇలా చెబుతోంది: "ఎవ్వరూ కాని ప్రజల ప్రయోజనాలకు భంగం కలిగించడానికిగాను తన వ్యక్తిగత ఆస్తిని వినియోగించడం రాజ్యాంగయంత్రం నిషేధిస్తుంది" మన దేశంలో, ప్రజాప్రయోజనాలకు భంగం కలిగించే "స్వతంత్రానికి" తావు లేదు. అయితే, వ్యక్తిప్రయోజనాలకు మన వ్యవస్థ పూర్తిహామీ ఇస్తుంది. మన దేశం, సమాజాల ప్రయోజనాలను, వ్యక్తిగత ప్రయోజనాలను విడతీయు వీలు లేదు. సోషలిజం, సమష్టి విధానం, వ్యక్తి ప్రయోజనాల నుండి దూరంకాలేవు. దేశ, సమాజాల ప్రయోజనాలకు మన వ్యవస్థ సంపూర్ణమైన రక్షణ కల్పిస్తుంది. ప్రజాసామాన్యం యొక్క వ్యక్తిగతప్రయోజనాలు తీరడానికి ఈ ప్రజాప్రయోజనాలే పునాది.

దేశ,సమాజ జీవితంలో ప్రజలందరూ పాల్గొనేట్టు ఉత్సాహపరచగల వ్యవస్థ మనది. ప్రజల సమష్టి దృక్పథంతో, సంఘంపట్ల, దేశంపట్ల ఐచ్ఛికంగా తమ బాధ్యతలు నెరవేర్చడానికి మన వ్యవస్థ వీలుకలిగిస్తుంది. మన నూతన ప్రజాస్వామ్యవ్యవస్థ ప్రజల ప్రయోజనాలకు అనుగుణమైనదనడానికి ఇదినిదర్శనం. ప్రజలు సమష్టిదృక్పథంతో సమాజంపట్ల, దేశంపట్ల తమబాధ్యతలు నెరవేర్చడంవల్ల వారి వ్యక్తిగత ప్రయోజనాలకు, వ్యక్తి

స్వాతంత్ర్యానికి నష్టం కలుగుతుందా ? ఎంతమాత్రం లేదు. నూతన ప్రజాతంత్ర, సోషలిస్టు వ్యవస్థక్రింద, వ్యక్తి ప్రయోజనాలు, దేశ, సమాజ ప్రయోజనాలు అవిభాజ్యమైనవని ప్రజలు తమకు తాము గ్రహించగలుగుతారు. అవిరెండూ ఒకటే. నూతన ప్రజాతంత్ర, సోషలిస్టువ్యవస్థలక్రింద, ప్రజలకు సంపూర్ణమైన ప్రజాతంత్ర హక్కులున్నవి. పూర్తి బాధ్యతలుకూడా వున్నవి. రాజ్యాధికారాన్ని నిర్వహించేది ప్రజలే అయినందున, రాజ్యాధినేతలుగా వారు తమబాధ్యతలు నిర్వర్తిస్తారు.

మన దేశంలో ప్రజలహక్కులు, కర్తవ్యాలు సమ్మిళితమైనాయి. హక్కులు లేకుండా బాధ్యతలుకాని, బాధ్యతలు లేకుండా హక్కులుకాని ఎవ్వరికీ లేవు. పౌరులందరూ రాజ్యాంగాన్ని, చట్టాలను గౌరవించాలని, కార్మిక క్రమశిక్షణను, పౌరశాంతిని పాటించాలని, సాంఘిక, నైతిక సూత్రాలను గౌరవించాలని, రాజ్యాంగముసాయిదా నిర్దేశిస్తున్నది. పౌరులందరూ సమాజ ఆస్తులను రక్షించాలని, పన్నులు చెల్లించాలని, చట్టరీత్యా సైనిక సర్వీసు చేయాలనికూడా రాజ్యాంగం విధిస్తున్నది. "మాతృదేశాన్ని రక్షించడం చైనాప్రజారిపబ్లిక్‌లో ప్రతి ఒక్క పౌరుని పవిత్రకర్తవ్యం" అని కూడా రాజ్యాంగం చెబుతున్నది. రాజ్యాంగంలో పొందుపరచబడ్డ కర్తవ్యాలన్నిటినీ, ప్రతి ఒక్క పౌరుడూ ఎట్టి మినహాయింపులు లేకుండా నెరవేర్చాలి. ఈ అంశాలు మాతృదేశంపట్ల తమ కర్తవ్యం నెరవేర్చాలనే దృక్పథాన్ని ప్రజలలో యినుమడింపచేస్తాయి. ప్రజలపరమైన మన దేశంలో, దేశప్రయోజనాలు, ప్రజల ప్రయోజనాలు ఒకటే అయినందున, దేశంపట్ల తమ

కర్తవ్యాన్ని నెరవేర్చితీరాలని ప్రజలు భావిస్తారు. ఈ కర్తవ్యాలను ఎగవేసేవా రెవరైనాసరే, ప్రజల అభిశంసనను తప్పించుకోలేరు.

మన మాతృభూమిని రక్షించడానికి, నిరంతరం నూతన ప్రజాస్వామ్యాన్ని బలవత్తరం చేయడానికి, సోషలిస్టునిర్మాణ మహాకార్యంలో పాల్గొనడానికి మన ప్రజలు తమ శక్తియుక్తులన్నిటినీ వినియోగించగోరుతున్నారు. ఇది సహజమే. ఎందువల్లంటే, మన మాతృభూమి ఎంత సర్వసమృద్ధంగా, శక్తివంతంగా వుంటే, మన ప్రజాసామ్యవ్యవస్థ ఎంత బలవత్తరంగా వుంటే మనసోషలిస్టు నిర్మాణం ఎంతగా అభివృద్ధి చెందితే, ప్రజల స్వాతంత్ర్యం, హక్కులు అంతగా విస్తృతమవుతాయి.

(4) జాతీయ స్వయంపరిపాలనా హక్కు సమస్య.

రాజ్యాంగ ముసాయిదా ఉపోద్ఘాతం, వివిధ ఆర్టికల్సు, దేశంలోని వివిధ జాతులమధ్య సమానతను, స్నేహ, పరస్పర సహకార సంబంధాలను నిర్వచిస్తాయి. జాతీయ మైనారిటీల స్వయం నిర్ణయ హక్కులను సంరక్షిస్తాయి.

చైనా ప్రజారిపబ్లిక్ స్థాపననుంచీ, వివిధజాతులను అణచిపెట్టడానికి అవకాశమిచ్చిన పద్ధతి రద్దుచేయబడింది. వివిధ జాతులమధ్య సమానత, స్నేహం, పరస్పరసహాయం ప్రాతిపదికపై నూతన సంబంధాలు ఏర్పడ్డాయి. జాతీయ మైనారిటీ ప్రాంతాలలో రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక కార్యకలాపాలు ప్రారంభమైనాయి. ప్రజాజీవితం క్రమంగా అభివృద్ధిచెందుతున్నది. మనదేశం ఇప్పటికే సమాన, స్వతంత్ర జాతుల గొప్ప కుటుంబంగా రూపొందింది. ఈ అనుభవం ముసాయిదాలో

పొందుపరచబడింది. జాతుల ప్రాంతీయ స్వయంనిర్ణయ హక్కుపైన, జాతీయ మైనారిటీల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధివిషయాలపైన ఉమ్మడికార్యక్రమంలో పొందుపరచిన అంశాలకు అదనంగా ముసాయిదాలో పొందుపరచబడ్డాయి.

మనదేశం కార్మికవర్గ నాయకత్వాన వున్న నూతన ప్రజాతంత్ర రాజ్యం. అది ఇప్పుడు సోషలిస్టు సమాజంవైపు పురోగమిస్తున్నది. అందుచేత, జాతీయ సమస్య పరిష్కారంలో, వివిధ జాతులమధ్య సహకారాన్ని సాధించటంలో మనదేశం సంపూర్ణ ప్రజాస్వామ్యాన్ని, జాతీయ సమానతా భావాన్ని అమలు పరచగలుగుతున్నది. ప్రాంతీయ స్వయంనిర్ణయ సూత్రాల ప్రకారం, వివిధ జాతులకు తమ వ్యవహారాలు నిర్వహించుకునే హక్కులిస్తూ, మొత్తం దేశంయొక్క రాజకీయ జీవితంలో సముచితపాత్ర వహించడానికి అవకాశం ఇవ్వడం ద్వారానే, వివిధ జాతులమధ్య గతంనుంచి సంక్రమించిన అడ్డుగోడలు, విచక్షణా నిర్మూలం కాగలవని, ఆవిధంగానే పరస్పర విశ్వాసం, ఐక్యత క్రమంగా బలపడగలవని మనం దృఢంగా నమ్ముతున్నాము.

జాతీ, తెగ అనే విచక్షణలేకుండా మనదేశ పౌరులందరూ సమాన హక్కు లనుభవిస్తారని ముసాయిదా స్పష్టంచేస్తున్నది. ఏ ఒక జాతినిగాని, తెగనుగాని, అణచడంగాని, విచక్షణతో చూడటంగాని చట్టవిరుద్ధమనికూడా ముసాయిదా చెబుతున్నది. తమ భాషలను ఉపయోగించడానికి, అభివృద్ధిచేసుకోడానికి, తమ అలవాట్లను, సాంప్రదాయాలను రక్షించుకోడానికిగాని,

సంస్కరించుకోడానికిగాని అన్ని జాతులకు స్వేచ్ఛవున్నదనికూడ తెలుపుతున్నది. ఈ విధంగా, జాతులసమస్యలో మనం ఈ వరకే అమలుపరుస్తున్న నూతన ప్రజాతంత్ర, సోషలిస్టు సూత్రాలకు రాజ్యాంగ ముసాయిదా చట్టరూపం ఇస్తున్నది. ఆ సూత్రాల దృష్ట్యా తీసుకోవలసిన ఖచ్చితమైన చర్యలను నిర్వచిస్తున్నది.

మన దేశంలోని అన్ని జాతుల ఉమ్మడి ప్రయోజనాలను ముసాయిదా ప్రతిబింబిస్తున్నది. వందసంవత్సరాలకుపైగా, యీ జాతులు హన్‌జాతి, ఇతర సోదరజాతులు-విదేశసామ్రాజ్యవాదులచే అణచివేయబడ్డాయి. దీర్ఘకాల చరిత్రలో మనజాతుల మధ్య ఏర్పడిన సంబంధాలను విచ్ఛిన్నంచేయడానికి సామ్రాజ్యవాదులు అన్నివిధాలయిన కుట్రలకు పూనుకున్నారు. "విభజించి పాలించే" విధానాన్ని కొనసాగించచూశారు. చైనాప్రజా రిపబ్లిక్ స్థాపన చైనాలోని జాతులన్నింటినీ, సామ్రాజ్యవాద పీడననుంచి విముక్తంచేసింది. అయితే, జాతులను చీల్చి, తిరిగి దాస్యబంధనాలలో ఇరికించడానికి, సామ్రాజ్యవాదులు ఇంకా విఫలప్రయత్నాలు సాగిస్తూనేవున్నారు. సామ్రాజ్యవాదుల ఈ దురాక్రమణ పన్నాగాల దృష్ట్యా, మన జాతులు ఇంకోధికంగా జాగరూకత వహించాలి. సామ్రాజ్యవాదుల పన్నాగాలు సాగటానికి అవకాశం యివ్వరాదు. మాతృదేశ ఏకీకరణను వారు బలపరచి, సంఘటితం చేయాలి. మాతృదేశ నిర్మాణానికి చేసే సమష్టికృషిలో సమైక్యమవ్వాలి. చైనాప్రజారిపబ్లిక్ సమైక్య, విభిన్నజాతుల రాజ్యమని. జాతీయస్వపరిపాలనా ప్రాంతాలు ప్రజారిపబ్లిక్‌నుంచి విడతీయరాని భాగాలని రాజ్యాంగ ముసా

యిదా చెబుతున్నది. ఇలాంటి నిర్వచనం అవసరం. ఇది మన దేశంలోని జాతులన్నింటి ఉమ్మడి ప్రయోజనాలకు అనుగుణంగా వున్నది.

జాతీయ మైనారిటీలు తగు సంఖ్యలోవున్న ప్రాంతాలలో, తమ స్వపరిపాలనా హక్కులను చెలాయించడానికి రాజ్యాంగ ముసాయిదాలోని వివిధఅంశాలు హామీ ఇస్తున్నవి. జాతీయ స్వపరిపాలనా ప్రాంతాలలో పరిపాలనాయంత్ర ఉపాంగాలు మామూలు స్థానిక ప్రభుత్వ విధులను, అధికారాలను చలాయించడమేగాక, రాజ్యాంగం ప్రకారం, చట్టం నిర్వచించే అధికారాలకు లోబడి, తమ ఆర్థిక వ్యవహారాలను కూడా నిర్వహిస్తాయి. దేశమిలిటరీ విధానాన్ననుసరించి, అవి స్థానికంగా శాంతి భద్రతల రక్షణకు బలగాలను ఏర్పరచుకోవచ్చు. స్థానికజాతుల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక లక్షణాలకు తగినట్లు, స్వపరిపాలనా నిర్వహణ నిబంధనలను, ఇతర ప్రత్యేక నిబంధనలను రూపొందించుకోవచ్చు. ప్రతి జాతీయ స్వపరిపాలనా ప్రాంతంలో, పరిపాలనా సంస్థల స్వరూపాన్ని ఆ ప్రాంతంలో అధికారం చెలాయించే జాతుల అధిక సంఖ్యాకప్రజల అభీష్టాన్ననుసరించి నిర్ణయిస్తారు. తమ కార్యకలాపాలలో పరిపాలనా సంస్థలు, ఆప్రాంతంలో వాడుకలో వుండే భాషలను ఉపయోగించాలి. సియాంగ్‌కు (జిల్లావంటిది)సరిపోయే ప్రాంతంలో మైనారిటీజాతులు యేదోఒక సంఖ్యలోఉన్నపుడు పైనపేర్కొన్న హక్కులన్నిటినీ చెలాయించే స్వపరిపాలనా సంస్థలు నెలకొల్పడం అసాధ్యమూ, అనవసరమూను. అయినప్పటికీ, అక్కడ నివసించే జాతుల ప్రత్యేకావసరాలకు సరిపోయేట్లు జాతీయ సియాంగ్‌ను నెలకొల్పాలి.

పెద్దజాతి అనే అహంకారం కాని, స్థానిక జాతీయ దుర భిమానం కాని, రెండూ తప్పుడుధోరణులే. మన దేశంలోని జాతుల ఐక్యతకూ, జాతీయ, ప్రాంతీయస్వపరిపాలనకూ ఈ రెండు విధాలైన అభిప్రాయాలూ ప్రమాదం తెచ్చిపెట్టేవే. సామ్రాజ్య వాదాన్ని, వివిధ జాతులలో ఉండే ప్రజా శత్రువులనేగాక, పెద్దజాతి అహంకారాన్ని, స్థానిక జాతీయ దురభిమానాన్ని ప్రతిఘటించినప్పుడే, ప్రతిఘటించిన జాతుల ఐక్యత ఇదివర కెన్నడూ లేనంతగా సుదృఢమవుతుం దని రాజ్యాంగ ముసాయిదా ఉపోద్ఘాతం స్పష్టంచేస్తున్నది.

మన దేశ జనాభాలో "హాన్"జాతి అత్యధిక సంఖ్యాకంగా వున్నది. చారిత్రక కారణాలవల్ల, హాన్ జాతికి ఇతర జాతులకు మించిన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికస్థాయి వున్నది. అయితే అంతమాత్రం చేత, ఆ జాతికి ప్రత్యేకహక్కు లుండటానికి వీల్లేదు. సోదర జాతులపట్ల హాన్ జాతి అహంభావం ప్రదర్శించ టానికి హక్కు లేదు. కాగా, సోదరజాతుల అభివృద్ధికి తోడ్పడ వలసిన బాధ్యత దానిపై వున్నది. జాతీయ మైనారిటీలన్నీ జాతీయ సమానత హక్కులను సాధించుకున్నప్పటికీ, ప్రస్తుతం అవివున్న పరిస్థితులలో, స్వశక్తివల్ల తమ ఆర్థిక, సాంస్కృతిక అధోగతిని తక్షణం అధిగమించలేవు. అందుచేత, వారికి హాన్ జాతి సహాయపడటం ముఖ్యమైన కర్తవ్యంగా ఎంచాలి. హాన్ ప్రజలు ప్రత్యేకించి, జాతీయ మైనారిటీ ప్రాంతాలలో పనిచేయడానికి పంపబడిన కేడర్లు ఆయా జాతుల ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి వారి జీవన ప్రమాణాన్ని పెంపొందించడానికి అత్యధికశ్రద్ధ వహించాలి. మైనారిటీ

జాతులకు వారు హృదయపూర్వకంగా సేవచేయాలి. జాతుల కేడర్లు క్రమంగా అభివృద్ధిచెంది, ఆ ప్రాంతాలలో కార్యకలాపాలన్నిటికీ స్వయంగా నాయకత్వం వహించేట్లు, ఓపికగా వారికి తోడ్పడాలి. గతంలోని పాలకవర్గ అభివృద్ధి నిరోధక భావాల ప్రాబల్యానికి లోనై, కొందరు హాన్‌జాతి ప్రజలు, కేడర్లుసైతం, హాన్ జాతీయ దురహంకారధోరణులను విడనాడకుండా వున్నారు. జాతీయ మైనారిటీల సాంప్రదాయాలను, అలవాట్లను అగౌరవపరచటం, వారి భాషలను గౌరవించకపోవటం, జాతీయ మైనారిటీలకు మత స్వాతంత్ర్యం, తమ అంతరంగిక వ్యవహారాలను నిర్వహించుకునే హక్కు వున్నదని గుర్తించకపోవడం, జాతీయ మైనారిటీ ప్రాంతాలలో పనిచేస్తున్నప్పటికీ, వారి కేడర్లను గౌరవించకపోవడం, పని విషయంలో వారిని సంప్రతించకపోవడం, కార్యాచరణద్వారా మైనారిటీల కేడర్లు వివిధ విషయాలలో తమ సామర్థ్యాన్ని పెంపొందించుకోగలరని నమ్మకపోవడం మున్నగునవన్నీ ఇలాంటి ధోరణులే. ఇలాంటి ఆలోచన, ప్రవర్తన, జాతుల ఐక్యతను నిర్మూలిస్తుందనడంలో సందేహం లేదు. మన రాజ్యాంగవ్యవస్థలో ఇలాంటి పద్ధతులకు స్థానంలేదు. హాన్‌జాతిప్రజలు, కేడర్లు హాన్ జాతీయ దురహంకారాన్ని అధిగమించడానికి నిరంతరం కృషిసల్పాలి. మరొకవైపు జాతీయ మైనారిటీలలో ఒకవిధమయిన స్థానిక జాతీయ దురభిమానదృక్పథం వుంది. ఇదికూడా హాన్ దురహంకారంలాగే, గతానికిచెందిన అవశేషం. ఈ స్థానిక దురభిమాన ధోరణి, ప్రవర్తనాకూడా జాతులఐక్యతకు భంగం కలిగిస్తుందని, ఆయా జాతుల, ప్రయోజనాలకే విరుద్ధమని, మనం గుర్తించాలి. అందుచేత దీనినికూడా అధిగమించాలి.

సోషలిస్టు సమాజనిర్మాణం మన దేశంలో అన్ని జాతుల ఉమ్మడి లక్ష్యం. సోషలిజంమాత్రమే ప్రతిజాతికి, ఉన్నతమైన ఆర్థిక సాంస్కృతికాభివృద్ధిని గ్యారంటీ చేస్తుంది. ఈ ఉజ్వలమైన మార్గాన్ని క్రమంగా అన్నిజాతులూ చేపట్టేందుకు మన రాజ్యాంగయంత్రం సహాయపడాలి.

అయితే, ప్రతిజాతికీ విభిన్నమైన చరిత్ర వుంది. అన్ని జాతులూ ఒకేసమయంలో, ఒకేమార్గంలో సోషలిజాన్ని చేసుకోగలవని భావించడానికి వీలులేదు. రాజ్యాంగముసాయిదా ఉపోద్ఘాతంల ఇలా అంటున్నది: "ఆర్థిక సాంస్కృతికాభివృద్ధి విషయంలో వివిధజాతుల అవసరాలను ప్రభుత్వం దృష్టిలో పెట్టుకుంటుంది. సోషలిస్టు పరిణామం విషయంలో వివిధజాతుల అభివృద్ధిలో ప్రత్యేకాంశాలపట్ల పూర్తిశ్రద్ధవహిస్తుంది." అంటే సోషలిస్టు మార్పులు ఎప్పుడు ఎలా జరుగుతాయనేది, ఆ యా జాతుల అభివృద్ధిలో విభిన్నదశలనుబట్టి నిర్ణయమవుతుంది. ఈ విషయాలన్నింటిలో వివిధ జాతుల ప్రజలకు, ప్రజానీకంతో సన్నిహిత సంబంధమున్న నాయకులకూ, సమగ్రంగా ఆలోచించడానికి, తమ తమ అభీష్టా ప్రకారం నిర్ణయాలు చేసుకోడానికి అవకాశమివ్వాలి.

కొన్ని జాతీయ మైనారిటీప్రాంతాలలో సోషలిస్టు మార్పులు హాన్ ప్రజలు నివసించేప్రాంతాలకన్నా ఆలస్యంగా ప్రవేశపెట్టబడతాయి. ఆ మార్పుల అమలుకు అక్కడ ఎక్కువకాలంకూడా పట్టవచ్చు. ఈ జాతీయమైనారిటీ ప్రాంతంలో సోషలిస్టుమార్పులు అమలుజరగడం ప్రారంభమయ్యేసరికి, దేశంలోని పలుప్రాంతాలలో సోషలిస్టు పరిణామం

బహుశా ఘనవిజయాలనుకూడ సాధించివుంటుంది. అప్పటికి జాతీయమైనారిటీ ప్రాంతాలలో సోషలిస్టు పరిణామాలకు పరిస్థితులు మరింత అనుకూలమవుతాయి. ఎందుకంటే, అప్పట్లో వారికి సహాయపడటానికి ప్రభుత్వ శక్తిస్తోమతలు అధికంగా వుంటాయి. దేశమంతటా సోషలిజం విజయాన్ని, దాని సత్ఫలితాలను చూచిన మైనారిటీజాతుల ప్రజానీకం ఆమార్గం అనుసరించడానికి అంగీకరిస్తారుకూడా. సోషలిస్టు పరిణామాలు తమ స్వీయ ప్రయోజనాలను దెబ్బతీస్తాయని ఆ దోళన చెందేవారు కొద్దిమంది వున్నప్పటికీ, వారి జీవనాన్ని రక్షించడానికి అవసరమైన విధానాన్ని ప్రభుత్వం అనుసరిస్తుంది.

ఆవిధంగా, జాతీయ మైనారిటీప్రాంతాలలో, సోషలిస్టు పరిణామాలకు ఎక్కువకాలం పట్టవచ్చు. మరింత క్రమపద్ధతిగా, సమరసపూర్వకంగా జరగవచ్చు. ప్రజాస్వామ్య సంస్కరణలు పూర్తిగా అమలుజరగని ప్రాంతాలలో, వాటిని పూర్తి చేయడానికి కొన్ని సమరసచర్యలు తీసుకుని, ఆ ప్రాంతాలు క్రమంగా సోషలిజంవైపు పురోగమించేట్టు చేయవచ్చు. మన దేశ ప్రజలలో, మన జాతీయ మైనారిటీలలో నూతన ప్రజాస్వామ్యవ్యవస్థను బలపరచేవారికీ, మన మాతృదేశ కుటుంబంలో సమైక్యభాగస్వామిగా ఉండేవారికి ఉజ్వలభవిష్యత్తు వుంది. సోషలిస్టుసమాజంలో వారికి చక్కటి అవకాశాలున్నవి. అది నిస్సందేహం.

పైన చెప్పినదంతా, రాజ్యాంగ ముసాయిదా మూల స్వభావాన్ని విపులీకరిస్తుంది.

3. దేశవ్యాప్తచర్చల సందర్భంలో రాజ్యాంగ ముసాయిదాపై వెలిబుచ్చబడిన అభిప్రాయాలు :

రాజ్యాంగ ముసాయిదాపై దేశవ్యాప్తంగా చర్చలు జరిగినపుడు అనేకసూచనలు వచ్చాయి. అనేక సమస్యలు లేవనెత్తబడ్డాయి. ఈ సమస్యలలో కొన్నింటికి నేనీవరకే జవాబులిచ్చాను. మరికొన్నిటికి ఇపుడు సమాధానా లివ్వదలిచాను.

ప్రజలుచేసిన సూచన లన్నింటినీ, రాజ్యాంగ రచనా సంఘం పరిశీలించింది. కొన్నిసూచనలు రాజ్యాంగానికి సంబంధించినవి కావు. వివిధచట్టాలకు సంబంధించినవి. ఆ యా చట్టాలు తయారుచేసేటపుడు ఆ సూచనలు పరిశీలించబడతాయి.

ప్రజలు చేసిన సూచనలప్రకారం, రాజ్యాంగ ముసాయిదాలో అనేకమార్పులు చేయబడ్డాయి. అందులో కొన్ని విషయానికి, కొన్ని పదాలకు సంబంధించినవి.

ఈ సూచనలప్రకారం చేసిన మార్పులన్నింటినీ, మీకు వివరించటం అవసరంలేదు. కొన్ని ముఖ్యమైన మార్పులను ఉదహరించి, వాటిని వివరిస్తాను.

1. రాజ్యాంగ ముసాయిదా మూడవ ఆర్టికల్‌లో మూడవపేరాకు సవరణ. ఈ పేరా మొదట ఇలా వుంది : "అన్నిజాతులకు తమ భాషలను అభివృద్ధి చేసుకోడానికి, తమ సాంప్రదాయాలను, అలవాట్లను, మత విశ్వాసాలను రక్షించుకోడానికి, సంస్కరించుకోడానికి స్వేచ్ఛవుంది." ఉమ్మడి కార్యక్రమంలో ఇదే విధమైన అంశంప్రకారం ఇది రూపొందించబడింది. జాతులకు తాము వాడుకొనే, వ్రాసుకొనే భాషలను



14

అభివృద్ధి చేసుకోడానికేగాక, ఉపయోగించుకోడానికికూడా స్వేచ్ఛవుందని ఈ ఆర్టికల్‌లో పేర్కొనాలని కొంతమంది సూచించారు. "చైనా ప్రజా రిపబ్లిక్ పౌరులకు మత స్వాతంత్ర్యము వుంది" అని 88 వ ఆర్టికల్ చెబుతున్నందున, మత స్వాతంత్ర్యం గురించి, తిరిగి ఈ ఆర్టికల్‌లో పేర్కొనడం అనవసరమని కొందరన్నారు. అందుచేత ఈ ఆర్టికల్‌లో ఆ అంశాన్ని తొలగించాలని సూచించారు. ఈ సూచనలు సరి అయినవేనని రాజ్యాంగ రచనాసంఘం భావించింది. అందు చేత, మూడవ ఆర్టికల్‌లో మూడవ పేరాను ఇలా మార్చింది: "జాతు లన్నింటికీ తమ భాషలను వాడుకోడానికీ, అభివృద్ధి చేసుకోడానికీ, తమ సాంప్రదాయాలను, అలవాట్లను కాపాడు కోడానికీ, సంస్కరించుకోడానికీ స్వేచ్ఛవున్నది."

2. రాజ్యాంగ ముసాయిదాలో ఐదవ ఆర్టికల్ సవరణ. మన దేశంలో ఉత్పత్తిసాధనాలపై ప్రస్తుతమున్న వివిధరకాల యాజమాన్యాలను ఈ ఆర్టికల్‌లో వివరించారు. ఈ ఆర్టికల్‌లో పేర్కొనబడిన నాలుగువిధాలైన యాజమాన్యాలు - ప్రభుత్వ యాజమాన్యం, సహకార యాజమాన్యం, వ్యక్తిగత కష్టజీవుల యాజమాన్యం, పెట్టుబడిదారీ యాజమాన్యం - ప్రస్తుతం మన దేశంలోవున్న ప్రధానమైన యాజమాన్యాలను మాత్రమే తెలుపుతున్నది కాని, అన్నిటినీ కాదని స్పష్టంగా పేర్కొనాలని ఒక సూచనవచ్చింది. మన దేశంలో ఈనాలుగు విధాలైన యాజమాన్యాలే గాక, ఇంకా మరికొన్ని వున్నవని, అందుచేత "ప్రధానమైన" అనే పదం చేర్చకపోవడం లోపమని ఈ సూచనచేసేవారు వాదించారు.

ఈ అభిప్రాయం మనదేశంలోని వాస్తవపరిస్థితులను ప్రతిబింబిస్తున్నదని రాజ్యాంగ రచనాసంఘం భావించింది. జాతీయ మైనారిటీలు నివసించే అనేక ప్రాంతాలలో ఫ్యూడల్ యాజమాన్యం, ఫ్యూడల్ యాజమాన్యంకంటె వెనుకబడ్డ యాజమాన్యరూపాలుకూడా ఈనాటికీ వున్నవి. "జాతీయ మైనారిటీల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక లక్షణాలకు తగినట్లు అన్ని స్వపరిపాలనా ప్రాంతాలలో పాలకసంస్థలు ప్రభుత్వ నిర్వహణ నిబంధనలను, ఇతర ప్రత్యేక నిబంధనలను తయారు చేయాలని" రాజ్యాంగ ముసాయిదా 70 వ ఆర్టికల్‌లో నాలుగవ పేరా నిర్దేశిస్తున్నది.

ఇక్కడ పేర్కొన్న "ఆర్థిక లక్షణాలు" జాతీయ మైనారిటీ ప్రాంతాలలోనున్న వివిధ ప్రత్యేక యాజమాన్యాలకు అనువర్తిస్తాయి. అయితే, జాతీయ ఆర్థికవ్యవస్థలో ఈ ప్రత్యేక యాజమాన్యాల స్థానం అతిస్వల్పం. అంతేగాక, తైవాన్‌రాష్ట్రంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు, చాంగ్ విద్రోహముఠా తైవాన్ ప్రజలను నిరంకుశంగా అణచివేస్తూ, దోపిడీసాగిస్తున్నారు. ఆ రాష్ట్రంలో విదేశ సామ్రాజ్యవాద, బురాక్రటిక్ పెట్టుబడిదారీ, భూస్వామ్య యాజమాన్యాలు వుండటమేగాక, ఆధిపత్యంకూడా వహిస్తున్నాయి. ఐదవ ఆర్టికల్‌లో పేర్కొన్న నాలుగురకాలైన యాజమాన్యాలలో వీటిని చేర్చలేదు.

అందుచేత, రాజ్యాంగ రచనాసంఘం ఈ సూచనను అంగీకరించి "ప్రధానమైన" అనే పదాన్ని 5 వ ఆర్టికల్‌లో చేర్చింది.

సహకార యాజమాన్యం కష్టజీవుల సమష్టి యాజమాన్యమేనని 5 వ ఆర్టికల్‌లో మరొక మార్పు స్పష్టం చేస్తున్నది. ఈ సవరణ, సహకారయాజమాన్యం నిర్వచనాన్ని మరింత తేటతెల్లం చేస్తున్నది.

3. రాజ్యాంగ ముసాయిదా 8, 9, 10 ఆర్టికల్సులో మొదటి పేరాలు సవరించబడ్డాయి. చట్ట ప్రకారం ఉత్పత్తి సాధనాలను, ఇతర ఆస్తులను కలిగివుండటానికి, రైతుల, చేతి పనిదారుల, ఇతర వ్యవసాయేతర వ్యక్తిగత కష్టజీవుల, పెట్టుబడిదారుల హక్కులను ప్రభుత్వం రక్షిస్తుందని ఈ పేరాలలో ప్రత్యేకంగా పేర్కొనబడింది. అయితే ఈ అంశాలు, 11 వ ఆర్టికల్‌లోని అంశాలు కలగా పులగంగా వున్నాయి. ఆర్టికల్ 11 ఇలా అంటున్నది: "చట్ట సమ్మతమైన ఆదాయాలపైన, సేవింగ్స్‌పైన, ఇండ్లపైన, జీవిత సాధనాలపైన పౌరుల యాజమాన్యహక్కులను ప్రభుత్వం రక్షిస్తుంది." ఇందులో అందరు పౌరులూ చేరివున్నారు. ఉత్పత్తి సాధనాలను మినహాయించి, అన్నిరకాలైన ఆస్తులపై యాజమాన్యహక్కులు ఇందులో ప్రస్తావించబడ్డాయి. అందుచేత, 8 వ ఆర్టికల్‌లో మొదటి పేరాను, ఇలా మార్చాము: "చట్టప్రకారం భూములను, ఉత్పత్తిసాధనాలను కలిగివుండటానికి రైతుల హక్కులను ప్రభుత్వం రక్షిస్తుంది." అలాగే ఆర్టికల్ 9 లో మొదటి పేరాను ఇలా సవరించాము: "చట్టరీత్యా ఉత్పత్తిసాధనాలపై యాజమాన్యం వహించడానికి చేతి పనిదారుల, వ్యవసాయేతర వ్యక్తిగత కష్టజీవుల హక్కులను ప్రభుత్వం రక్షిస్తుంది." ఆర్టికల్ 10 లో మొదటి పేరాను ఇలా మార్చాము: "చట్ట

రీత్యా ఉత్పత్తి సాధనాలపైన, ఇతర పెట్టుబడులపైన, పెట్టు బడిదారుల యాజమాన్య హక్కులను ప్రభుత్వం రక్షిస్తుంది." ఈ పేరాలో "ఇతర పెట్టుబడులు" అనేపదం పెట్టుబడిదారుల వద్ద ఉత్పత్తిసాధనాల రూపంలో వుండే పెట్టుబడిగాక, వాణిజ్య పెట్టుబడిలాంటివాటిని సూచిస్తుంది. ఈ మార్పులలో ముందు వెనుక ఉండే ఆర్టికల్సులో చర్చిత చర్వణం తొలగించబడింది.

రాజ్యాంగ ముసాయిదా 23 వ ఆర్టికల్‌లో 1 వ పేరా ఇలా చెబుతున్నది: "వివిధరాష్ట్రాలు కేంద్రాధికారం క్రిందికి వచ్చే మున్సిపాలిటీలు, జాతీయ మైనారిటీలు, సాయుధసేనలు, దేశాంతర చైనీయులు యెన్నుకునే ప్రతినిధులు జాతీయ ప్రజా ప్రతినిధుల సభలో వుంటారు." దాని నిపుడిలా మార్చారు: "వివిధరాష్ట్రాలు, స్వపరిపాలనా ప్రాంతాలు, కేంద్రాధికారం క్రిందకు వచ్చే మున్సిపాలిటీలు, సాయుధసేనలు, దేశాంతర చైనీయులు యెన్నుకునే ప్రతినిధులు జాతీయ ప్రజాప్రతినిధుల సభలో వుంటారు." ఈ సవరణకు కారణమేమంటే, జాతీయ ప్రజాప్రతినిధులసభకు ప్రతినిధుల యెన్నికలో, జాతీయ మైనారిటీలు ఒక నియోజకవర్గం కావు. రాష్ట్రాలు, కేంద్రాధికారం క్రిందకు వచ్చే మున్సిపాలిటీలలాగా, స్వపరిపాలనాప్రాంతాలే ప్రాంతీయ నియోజకవర్గాలవుతాయి.

అయితే, జాతీయ ప్రజాసభకు జాతీయ మైనారిటీల నుంచి ఎన్నుకోబడే ప్రతినిధులు స్వపరిపాలనా ప్రాంతాలనుంచే గాక, రాష్ట్రాలనుంచి, కేంద్రాధికారంక్రిందకు వచ్చే మున్సిపాలిటీలనుంచికూడ అధికంగా ఎన్నికవుతారు. అందుచేత, రాష్ట్రాలనుంచి కేంద్రాధికారంక్రిందికి వచ్చే మున్సిపాలిటీల

నుంచి జాతీయప్రజాసభకు జరిగే ప్రతినిధుల ఎన్నికలలో జాతీయ మైనారిటీలకు సరియైన ప్రాతినిధ్యం వచ్చేట్లు శ్రద్ధవహించాలి. ఇందువల్ల ఆర్టికల్ 23 లో 2 వ పేరానుకూడా సవరించాము. జాతీయ మైనారిటీల ప్రతినిధుల సంఖ్యను, వారి ఎన్నికపద్ధతిని ఎన్నికలచట్టాలు నిర్దేశించాలని స్పష్టంచేశాము. అసలు జాతీయ ప్రజాసభకు, స్థానిక ప్రజాసభలకు సంబంధించిన ఎన్నికలచట్టాలలో ఈ అంశాలు పొందుపరచబడ్డాయి. 1953 మార్చి 23 న కేంద్రప్రజాప్రభుత్వం పైచట్టాలు చేసింది.

జాతీయ ప్రజాసభ నెలకొల్పే వివిధ కమిటీలకు సంబంధించిన 34, 35 ఆర్టికల్సులోకూడ సవరణలు చేశాము.

ఆర్టికల్ 34 ప్రకారం జాతీయ ప్రజాసభ జాతుల కమిటీని, బిల్లుల కమిటీని, బడ్జెట్ కమిటీని, అర్హతా నిర్ణాయక కమిటీని, ఇంకా అవసరమైన ఇతర కమిటీలను నెలకొల్పుతుంది. ఈ సంస్థలన్నీ శాశ్వతంగా వుండేవి. జాతీయ ప్రజాసభ కార్యకలాపాలకు తోడ్పడడమే వీటి కర్తవ్యం. అయితే, వాటి కార్యకలాపాల స్వరూప దృష్ట్యా, జాతుల కమిటీ, బిల్లుల కమిటీ, జాతీయ ప్రజాసభ సమావేశంలో లేనపుడు, ప్రజాసభ స్థాయీసంఘ కార్యకలాపాలకు తోడ్పడవలసి వుంటుంది బడ్జెట్ కమిటీ, అర్హతా నిర్ణాయక కమిటీ, జాతీయ ప్రజాసభ సమావేశమైనపుడే పనిచేస్తాయి. ఈ రెండువిధాలైన కమిటీల కార్యక్రమాల మధ్య వ్యత్యాసం చూపడానికి ఆర్టికల్ 34 లో 2 వ పేరా ఇలా సవరించబడింది: "జాతీయ ప్రజాసభ సమావేశంలో లేనపుడు, జాతుల కమిటీ, బిల్లుల కమిటీ, ప్రజాసభ స్థాయీసంఘం ఆధ్వర్యాన వుంటాయి."

కొన్ని ప్రత్యేక సమస్యల విచారణకు కమిటీల నేర్పర్చేం దుకు, ఆర్టికల్ 35 లో ప్రజాసభకు అధికార మివ్వబడింది. ప్రజాసభ ఇతర ప్రభుత్వసంస్థల కార్యకలాపాలను పర్యవేక్షిం చేందు కవకాశమివ్వడానికి, ఇలాంటి తాత్కాలిక కమిటీలు ఏర్పాటవుతాయి. అందుచేత 34 వ ఆర్టికల్‌లో పేర్కొనబడ్డ కమిటీలకూ, ఈ కమిటీలకూ భేదముంది. మొదట ఇలాంటి కమిటీల స్వరూపం, కర్తవ్యాలు ఆ ఆర్టికల్‌లో స్పష్టం చేయ నందున, తదనుగుణ్యంగా ఆ ఆర్టికల్ సవరించబడింది. అంతే కాక, ముసాయిదాలో 31 వ ఆర్టికల్ ప్రకారం, ఇతర ప్రభుత్వ సంస్థల కార్యకలాపాలను పర్యవేక్షించడానికి ప్రజాసభ స్థాయీ సంఘం బాధ్యత వహించాలి. ఈ కర్తవ్య నిర్వహణకు, ప్రత్యేక సమస్యల విచారణకు ఇలాంటి కమిటీల నేర్పర్చడానికి స్థాయీ సంఘానికికూడా అధికారం వుండాలి. అందుచేత, ఆర్టికల్ 35 లో "ప్రజాసభ ఏర్పర్చే వివిధ కమిటీలు" అనేదాన్ని ఇలా మార్చాము: "ప్రత్యేక సమస్యల విచారణకు అవసరమను కున్నప్పుడు, జాతీయప్రజాసభ కమిటీలను ఏర్పర్చవచ్చు. ప్రజాసభ సమావేశంలో లేనప్పుడు అదేవిధంగా ప్రజా సభ స్థాయీసంఘం కమిటీలను ఏర్పర్చవచ్చు." ఈ సవ రణ ఆర్టికలు 34, 35 లలో పేర్కొనబడ్డ కమిటీలమధ్య వ్యత్యాసాన్ని తెలుపుతుంది. అదనంగా చేర్చిన అంశం, స్థాయీ సంఘానికికూడా ఇలాంటి కమిటీల నేర్పర్చుకునే అధి కార మిస్తుంది.

6. ఆర్టికల్ 79 రెండవ పేరాలో ఈ అంశం చేర్చ బడింది: పై స్థాయీలలోని ప్రజాకోర్టులు క్రిందిస్థాయీలలోని

ప్రజాకోర్టుల న్యాయ కార్యకలాపాలను పర్యవేక్షిస్తాయి." మన దేశం విశాలమైనది. జనాభా విస్తారంగావుంది. అనేక ప్రాంతాలలో రహదార్లు అనుకూలంగా లేవు. అందుచేత అన్నిస్థాయిాలలోని ప్రజాకోర్టుల, ప్రత్యేక ప్రజాకోర్టుల కార్యకలాపాలను పర్యవేక్షించే హక్కు సుప్రీంకోర్టుకుమాత్రమే వున్నదనడం వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా లేదు. న్యాయ వ్యవహారాలలో తప్పులు రాకుండా చూడటానికి, క్రింది స్థాయిాల ప్రజాకోర్టుల కార్యకలాపాలను పై స్థాయిాకోర్టులు పర్యవేక్షించే పద్ధతిని అమలుపరచుట తగివుంటుంది. మన దేశచరిత్రలో కోర్టుల అనుభవాన్ని దృష్టిలోపెట్టుకున్నా, ప్రస్తుతం మన దేశంలో పరిస్థితులను చూచినా అదే సరియైనది.

ప్రొక్యురేటర్ (పబ్లిక్ ప్రాసిక్యూటర్) పదవికి సంబంధించిన అంశాలలో ప్రధానంగా 81 - 84 ఆర్టికల్సులో రాజ్యాంగ రచనాసంఘం ముఖ్యమైన మార్పులుచేసింది. మన దేశంలో ప్రొక్యురేటర్ కార్యాలయం యంత్రాంగంలో ప్రజా ప్రొక్యురేటర్ జనరల్, స్థానిక ప్రజా ప్రొక్యురేటర్ అధికారులు, ప్రత్యేక ప్రజా ప్రొక్యురేటర్ అధికారులు వున్నారని ఈ మార్పులనుంచి తెలుసుకోవచ్చు. ప్రజా ప్రొక్యురేటర్ల యంత్రాంగంలో ప్రధాన ప్రొక్యురేటర్లు, ఉపప్రధాన ప్రొక్యురేటర్లు, ప్రొక్యురేటర్లు గాక, ప్రొక్యురేటర్ల కమిటీలు వుంటాయి. ఈ ప్రొక్యురేటర్ల కమిటీలు, ప్రొక్యురేటర్ల కార్యకలాపాలకు సంబంధించిన ప్రధాన సమస్యలను, ప్రధాన ప్రొక్యురేటర్ల నాయకత్వం క్రింద పరిష్కరిస్తాయి. సంయుక్త సమాలోచనలకై ఇలాంటి సంస్థలను ప్రజా ప్రొక్యురేటర్ల కార్యాలయాలలో

ఏర్పరచడం సమస్యల సమష్టిచర్చలకు తోడ్పడుతుంది. ప్రజా ప్రొక్యురేటర్ల కార్యాలయాలు తమ కార్యకలాపాలను మరింత సక్రమంగా నెరవేర్చడానికి వీలుకల్పిస్తుంది. ప్రొక్యురేటర్ల కార్యకలాపాలలో ఇలాంటిపద్ధతి అవలంబించడం మన దేశంలో నేటి పరిస్థితులకు తగినదని నమ్ముతున్నాము.

పైన పేర్కొన్నవి రాజ్యాంగ ముసాయిదాకు మేము చేసిన ముఖ్యమైన సవరణలు. ప్రజల సూచనలను పరిశీలించిన మీదట ఆ సవరణలు చేశాము.

రాజ్యాంగ రచనాసంఘం పరిశీలించి త్రోసిపుచ్చిన సూచనలనుకూడా నేను పేర్కొనదలచాను. ఆ సూచన లన్నింటినీ వివరించడం సాధ్యంకాదని వేరే చెప్పనవసరంలేదు. ఒకటి రెండు అంశాలనుమాత్రం వివరిస్తాను.

1. రాజ్యాంగ ఉపోద్ఘాతంలో చైనా విప్లవ చరిత్ర నంతటినీ, వివరంగా చెప్పాలని కొందరు సూచించారు. ఉదాహరణకు చైనాకమ్యూనిస్టుపార్టీ పాత్రను గురించి కార్మిక కర్షక ఐక్యత, ఐక్యసంఘటన నిర్వహించిన పాత్రగురించి, గత వంద సంవత్సరాలలో విప్లవ అమరయోధులు సాగించిన పోరాటాల గురించి ప్రజా రిపబ్లిక్ స్థాపించబడినప్పటినుంచి వివిధ రంగాలలో సాధించిన అభివృద్ధిగురించి, ఇంకా వివిధ విషయాలను గురించి మరింత సమాచారం ఇవ్వాలంటారు. ఈ సూచనలను రాజ్యాంగ రచనాసంఘం అంగీకరించలేదు.

మరికొందరు ఉపోద్ఘాతం విషయంలో రెండు పరస్పర విరుద్ధమైన సూచనలు చేశారు. కమ్యూనిస్టు సమాజం భవిష్యత్తులో ఏర్పడుతుందని పేర్కొనాలని ఒక సూచన; "ఇంకా

సాధించబడని విషయాలను" గురించి అసలు ప్రస్తావించనే కూడదని మరొక సూచన వచ్చాయి. ఈ రెండువిధాలైన అభిప్రాయాలనూకూడా అంగీకరించ లేదు.

వీటిని ఎందుకు అంగీకరించరాదు ?

చైనా ప్రజల విప్లవ విజయం ఫలితమే రాజ్యాంగ ముసాయిదా అని ఉపోద్ఘాతంలో స్పష్టం చేయటం అవసరం. అంతకంటె ముఖ్యమైన విషయమేమంటే, ఉపోద్ఘాతం మన దేశం ప్రస్తుతం పరివర్తనదశలో వున్నదనే చారిత్రక విషయాన్ని వివరించాలి. పరివర్తనదశలో ప్రభుత్వ కేంద్ర కర్తవ్యాన్ని నొక్కిచెప్పాలి; ఈ కర్తవ్యాన్ని నిర్వహించడానికి అవసరమయే దేశీయ, అంతర్జాతీయ పరిస్థితులను పేర్కొనాలి. చైనా ప్రజల విప్లవచరిత్ర కంతకూ ప్రశంసనీయవలసి వున్నప్పటికీ, ఉపోద్ఘాతంలో అవసరంకాని చారిత్రకాంశాలను చేర్చడము మంచిదికాదు.

మన రాజ్యాంగం పరివర్తనదశకోసం రూపొందించబడింది. అందుచేత సోషలిస్టుసమాజం నిర్మితమైన తర్వాత దశకు తయారయ్యే రాజ్యాంగానికి, దీనికి తప్పక వ్యత్యాసం వుండి తీరుతుంది. ఒకవైపు మనం ఇంకా సోషలిస్టుసమాజాన్ని నిర్మించలేదు. మరొకవైపు మనదేశంలో ఇప్పటికే సోషలిజం నిర్మించబడుతున్న విషయం వాస్తవం. సోషలిస్టునిర్మాణం దినదినం సాగిపోతున్నది. సోషలిజంసాధన త్వరాత నెలకొనే పరిస్థితులను రాజ్యాంగం వర్ణించడం లేదు. అయితే, ప్రస్తుత పరిస్థితులను సరిగా ప్రతిబింబించడానికి, వాస్తవజీవితంలో జరుగుతున్న మార్పులను, ఈమార్పులు దారితీసేలక్ష్యాన్ని రాజ్యాం

గం స్వీకరించాలి. ఈ లక్ష్యాన్ని పేర్కొనకపోతే, వాస్తవజీవితంలో అనేక విషయాలు అర్థంకావు. అందుచేతనే మన రాజ్యాంగంలో కొన్ని ఆర్టికల్సు కార్యక్రమరూపంలో వున్నవి.

ఈ కారణంవల్లనే, సోషలిజం ఇంకా నిర్మించబడనంత మాత్రాన, సోషలిజం నిర్మాణలక్ష్యాన్ని ఉపోద్ఘాతంలో పేర్కొనకపోవడం తప్పవుతుంది. అయితే, సోషలిస్టుసమాజ నిర్మాణలక్ష్యాన్ని సోషలిజం సాధించబడిన తర్వాత ఏర్పడే అవకాశాన్ని అనగా, కమ్యూనిజంకోసం జరిగే కృషినికూడా ఉపోద్ఘాతంలో చేర్చవలసిన అవసరంలేదు.

2. మన దేశంలో ఉత్పత్తి సాధనాలపై నేడున్న వివిధ రకాల యాజమాన్యాలను ఆర్టికల్ 5లో పేర్కొన్నాము. అందులో ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానాన్ని (స్టేట్ కేపిటలిజం) కూడా చేర్చాలని కొందరు సూచించారు. రాజ్యాంగ రచనా సంఘం ఈ సూచనను అంగీకరించలేదు. ఎందుచేతనంటే, ప్రస్తుతం మనదేశంలో పలురకాలైన ప్రభుత్వ పెట్టుబడిదారీ ఆర్థికవిధానా లున్నవి ఇవి ఆర్థికంగా ప్రభుత్వానికి పెట్టుబడిదారీ యాజమాన్యానికి వివిధ క్లిష్టమైన రూపాలలోగల సంబంధాలను ప్రతిబింబిస్తాయి. అయితే, ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానమే ఒక ప్రత్యేకమైన యాజమాన్యంగా వుండజాలదు. అందుచేత వివిధములైన యాజమాన్యాలు పేర్కొనబడ్డ ఆర్టికల్ 5 లో దానిని చేర్చకూడదు.

3. స్టేట్ కౌన్సిల్‌కు చెందిన వివిధ మంత్రిత్వశాఖల కమీషన్ల పేర్లను 2 వ అధ్యాయంలోని మూడవ సెక్షన్‌లో పేర్కొనాలని కొందరు సూచించారు. ఈ సూచనలనుకూడా

రాజ్యాంగ రచనాసంఘం ఆమోదించలేదు. ఎందువల్లనంటే జాతీయ నిర్మాణ కార్యక్రమం అభివృద్ధి చెందేకొద్దీ, కొన్ని పరిస్థితులలో స్టేట్ కౌన్సిల్ స్వరూపంలో మార్పులు చేయవలసి వుంటుంది. అందుచేత మార్పులు అవసరమైనప్పుడల్లా రాజ్యాంగంలో సవరణలు ప్రవేశపెట్టే అవసరం లేకుండా చేసేందుకుగాను, స్టేట్ కౌన్సిల్ శాఖలపేర్లు పేర్కొనలేదు. స్టేట్ కౌన్సిల్‌కు సంబంధించిన చట్టంలో వివిధ మంత్రిత్వశాఖల కమిషన్ల పేర్లను నమోదు చేయవచ్చు.

4. ప్రభుత్వసంస్థలకు చెందిన అంశాలలో కొంతమంది సవరణలు సూచించారు. జాతీయ ప్రజాసభవలె, స్థానిక ప్రజాసభలకుకూడా స్థాయీసంఘాలను నెలకొల్పుకునే అధికారముండాలని ఒకసూచన వచ్చింది. ఈ సూచనను రాజ్యాంగం రచనాసంఘం అంగీకరించలేదు.

స్థానిక ప్రజాసభల కార్యకలాపాలకన్నా, జాతీయప్రజాసభ కార్యక్రమం ఎంతో భారమైనదనే విషయం నిస్సందేహం. జాతీయ ప్రజాసభ ప్రభుత్వ చట్టబద్ధమైన అధికారాన్ని చలాయిస్తుంది. స్థానిక ప్రజాసభలకు అలాంటి కర్తవ్యాలుగాని, అధికారాలుగాని లేవు. అంతేగాక, ప్రజాసభ స్థాయి ఎంత తక్కువైతే అంత సులభంగా అది సమావేశం కావచ్చు. ప్రజాసభ అధికారం చెలాయించే ప్రాంతం చిన్నదికావడమే అందుకు కారణం. అందుచేత స్థానిక ప్రజాసభలకు ప్రజా కౌన్సిల్స్‌తో పాటు స్థాయీ సంఘాలుకూడా వుండటం అనవసరం. ఆ యా స్థాయీలలో ప్రజా కౌన్సిలే స్థానిక ప్రజాసభ కార్యనిర్వాహకవర్గంగా వుంటుంది. ప్రజాసభ స్థాయీసంఘ విధులను అధికా

రాలనుకూడా అది నిర్వహిస్తుంది. అందుచేత మరొక స్థాయీ సంఘాన్ని నెలకొల్పడమంటే, స స్థలను ఊరికే పెంచివేయడ మన్నమాట. అది అనవసరమైన ఇబ్బందులనుకూడా కలిగిస్తుంది.

5. చైనాప్రజల రాజకీయ సలహాసమితి హోదాను, విధులను ఉపోద్ఘాతంలో నిర్వచించాలని కొందరు సూచించారు. ఉపోద్ఘాతంలో ఈ కొత్తవిషయాన్ని చేర్చవలసిన అవసరం లేదని, రాజ్యాంగ రచనా సంఘం అభిప్రాయపడింది.

మన నూతన ప్రజాతంత్ర ఐక్యసంఘటనకు నిర్మాణ రూపమే చైనాప్రజల రాజకీయ సలహాసమితి. జాతీయ ప్రజా సభ తరఫున అది కర్తవ్యాలను, అధికారాలను చెలాయించింది. ఇకమీదట వాటిని చెలాయించవలసిన అవసరం వుండను. అయితే, ఐక్యసంఘటనసంస్థగా అది మన దేశ రాజకీయజీవితంలో తన పాత్ర నిర్వహిస్తూనే వుంటుంది. అది ఐక్యసంఘటన సంస్థ అయినందున ఐక్యసంఘటనలోని పార్టీలు, సంస్థలు, సంప్రతించుకొని దానికి సంబంధించిన అంశాలను నిర్ణయించుకుంటాయి.

6. మన దేశ భౌగోళిక సరిహద్దులను నిర్వచిస్తూ ఒక ఆర్టికల్‌ను రాజ్యాంగంలో చేర్చాలని కొంతమంది సూచించారు. ఇది అనవసరమని రాజ్యాంగ రచనాసంఘం భావించింది. సాంఘిక, రాజ్యాంగవిధానాన్ని చట్టరూపంలో పెట్టడమే రాజ్యాంగం ప్రాథమిక కర్తవ్యం. దేశ భౌగోళిక సరిహద్దులను నిర్వచించడం రాజ్యాంగ కర్తవ్యం కాదు. ఫెడరల్ రాజ్యాంగంలో, ఫెడరల్ యూనిట్లన్నిటినీ తప్పక పేర్కొనాలి.

అయితే మనది అలాంటి రాజ్యంకాదు. ఏకీకృతరాజ్యాలలో పరిపాలనా ప్రాంతాల హోదాను, సరిహద్దులను నిర్ణయించడం అవసరమని భావించినపక్షంలో, అన్ని పరిపాలనాప్రాంతాలను రాజ్యాంగంలో పేర్కొనవచ్చు. కాని మన దేశ ఆర్థిక నిర్మాణము ఇప్పుడే ప్రారంభమవుతున్నందున, పరిపాలనా ప్రాంతాల హోదా, సరిహద్దులు ఖచ్చితంగా నిర్ణయమైనట్లు చెప్పడానికి వీల్లేదు. ఉదాహరణకు, కేంద్ర ప్రజాప్రభుత్వ కౌన్సిల్ నిర్ణయం ప్రకారం, ఇటీవలనే కొన్ని రాష్ట్ర పరిపాలనా యూనిట్లు విలీనం చేయబడ్డాయి. అందుచేత ప్రస్తుత పరిస్థితుల ప్రాతిపదికపై అన్ని పాలనాప్రాంతాల పేర్లను రాజ్యాంగంలో నమోదు చేయడం అనుచితం. పరిపాలనా ప్రాంతాల సరిహద్దులను, హోదాను సరియైన కారణం లేకుండా మార్చరాదనడం నిజమే. అందుచేత రాష్ట్రాల, స్వపరిపాలనాప్రాంతాల, కేంద్రాధికారం క్రిందకు వచ్చే మున్సిపాలిటీల హోదాను, సరిహద్దులను ధృవపరిచే హక్కు జాతీయ ప్రజాసభకు మాత్రమే వున్నదని రాజ్యాంగం స్పష్టం చేస్తోంది. స్వపరిపాలనా ప్రాంతాలైన చౌ, కౌంటీ, మునిసిపాలిటీల హోదాను, సరిహద్దులను, ధృవీకరించే అధికారంకూడా స్టేట్ కౌన్సిల్ కే ఇవ్వబడింది.

భౌగోళిక సరిహద్దులను గురించి ఒక ఆర్టికల్ చేర్చాలని సూచించినవారు తైవాన్ మనదేశంలో అంతర్భాగమని రాజ్యాంగంలో స్పష్టం చేయడానికే ఆ ప్రతిపాదన చేశారు. ఇది సదుద్దేశ్యమే. అయితే ఇదుకుగాను రాజ్యాంగంలో ఆర్టికల్సు చేర్చవలసిన అవసరం లేదు. తైవాన్ చైనాలో అంతర్భాగమన్న విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. అమెరికన్ సామ్రాజ్య

వాదంనుంచి విద్రోహి చాంగ్ ముఠానుంచి తైవాన్‌ను విముక్తి చేసి, మనదేశ ఏకీకరణను పూర్తిచేయటం చైనా ప్రజల కర్తవ్యం. వారు దానిని తప్పక నెరవేరుస్తారు.

రాజ్యాంగ ముసాయిదా గురించి ప్రజలు చేసిన వివిధ సూచనలపై క్లుప్తంగా వ్యాఖ్యానించాను.

## 4. ముగింపు

సోదర ప్రతినిధులారా! మన ముసాయిదా రాజ్యాంగం చైనాలోని అన్నిజాతుల ప్రయోజనాలను వ్యక్తపరుస్తుందని, వాస్తవ విషయాలపై అది ఆధారపడిందని దేశవ్యాప్తంగా జరిగిన చర్చలలో నిరూపితమైంది. రాజ్యాంగ ముసాయిదాను చర్చించే సందర్భంలో ప్రజలు క్రిందివిధంగా అభిప్రాయాలు వెలిబుచ్చారు: "చైనా కమ్యూనిస్టుపార్టీ, ఛైర్మన్ మావో-సేటుంగ్‌ల నాయకత్వాన చైనాప్రజలు సాధించినదంతా రాజ్యాంగ ముసాయిదా వివరిస్తున్నది. ప్రస్తుతం ప్రారంభమైన కృషినీ, భవిష్యత్తులో జరగవలసిన, జరగవీలైన కార్యకలాపాన్నికూడా రాజ్యాంగం పేర్కొన్నది."

—"సోషలిజానికి మార్గం ఇప్పుడు సూర్యకాంతివలె స్పష్టంగా కనబడుతోంది."

—"ఈ రాజ్యాంగంవల్ల జాతీయ మైనారిటీలకు ఇతోధికంగా రాజకీయ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి కలుగుతుంది." మనం తయారుచేసిన రాజ్యాంగం "సుఖజీవితానికి హామీ ఇస్తుందని", అందులోని "ప్రతి ఆర్టికలూ ప్రజల ప్రయోజ

నాలను రక్షిస్తుందని" ప్రజానీకం భావిస్తున్నారు. రాజ్యాంగ ముసాయిదాను ప్రజలు ఆవిధంగా అర్థంచేసుకుంటున్నారు. అది సరియైనదికూడా.

జాతీయ ప్రజాసభ ఆమోదించిన తర్వాత మన రాజ్యాంగ ముసాయిదా మన దేశంయొక్క ప్రాథమిక ప్రభుత్వ చట్ట మవుతుంది. ఈ రాజ్యాంగం ప్రజల ప్రత్యక్షానుభవాన్ని, చిరకాల వాంఛలను వ్యక్తం చేస్తుంది. అందుచేత అది మన దేశ జీవనంలో ప్రబలమైన, ఉత్సాహపూరితమైన పాత్రను నిర్వహించగలుగుతుంది. విజయ ఫలితాలను రక్షించుకొని, అభివృద్ధి చేసుకోటానికి ప్రజలు సాగిస్తున్న పోరాటానికి ప్రోత్సాహం యిస్తుంది. మన సాంఘిక రాజ్యాంగ వ్యవస్థను నాశనంచేయ ప్రయత్నించే శత్రువు లందరినీ నిర్మూలిస్తుంది. మన నిర్మాణ కార్యకలాపాల సక్రమాభివృద్ధికి దోహదం చేస్తుంది. మనదేశ నిర్మాణాన్ని త్వరితం చేస్తుంది.

ప్రతి వ్యక్తి, ప్రతి ప్రభుత్వ సంస్థ ఎట్టి మినహాయింపు లేకుండా రాజ్యాంగాన్ని పాటించాలి. జాతీయ ప్రజాసభ ప్రతినిధులు, స్థానిక ప్రజాసభల ప్రతినిధులు, ప్రభుత్వోద్యోగు లందరూ ప్రజాసేవకులే. ప్రభుత్వసంస్థలన్నీ ప్రజలకు సేవచేయ డానికి సిద్ధంగా వుంటాయి. అందుచేత, రాజ్యాంగాన్ని పాటించడంలోనూ అది పాటించబడేట్లు చూడటంలోనూ వారిపై ప్రత్యేకబాధ్యత వుంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ మనదేశ నాయకత్వంలో అగ్ర స్థానంలో వుంది. అయితే, పార్టీ ఆక్రమించేస్థానం పార్టీసభ్యులు దేశజీవితంలో ప్రత్యేకసౌకర్యాలు పొందడానికి హక్కు ఇవ్వదు.

కాగా, వారు మరింత గురుతరబాధ్యతలు నిర్వహించవలసి వుంటుంది. రాజ్యాంగాన్ని, ఇతర చట్టాలను పాటించటంద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీ సభ్యులు ఆదర్శప్రాయులు కావాలి. కమ్యూనిస్టుపార్టీ సభ్యులందరూ ప్రజలతో సన్నిహితసంబంధా లుంచుకోవాలి. రాజ్యాంగాన్ని అమలుజరిపేందుకు ప్రజాతంత్ర పార్టీలతో, గ్రూపులతో, పార్టీ వెలుపలనున్న ప్రజాసామా న్యంతో సమైక్యంగా ప్రవర్తించి గట్టికృషి సాగించాలి.

చైనా ప్రజారిపబ్లిక్ రాజ్యాంగాన్ని జారీచేయడం మన దేశంలోని, అన్ని దేశాలలోని ప్రజలందరికీ ఆనందోత్సాహాలు కలిగించడమేకాక, ప్రపంచంలోని అన్ని దేశాలలోని మన మిత్రులకుకూడా సంతోషం చేకూర్చుతుంది. జనచైనాకు ప్రపంచంలో విస్తారంగా మిత్రులున్నారు. మహత్తర సోవియట్ యూనియన్, నూతన ప్రజాతంత్రదేశాలు మనకు సన్నిహిత మిత్రులు. నేల నాలుగు చెరగులా శాంతికాముకులందరూ కూడా మన స్నేహితులు. మన పోరాటానికి వారిచ్చిన మద్దతు మన విజయసాధనకు దోహదంచేసిన ప్రధానాంశాలలో ఒకటి. అందుచేత మన విజయానికి మన మిత్రులు ఆనందించడం మనం అర్థంచేసుకోవచ్చు. చైనా విప్లవ విజయానికి మహత్తరమైన ప్రపంచవ్యాపిత చారిత్రక ప్రాధాన్యత వుంది. చైనాలో సోషలిస్టు నిర్మాణ విజయానికికూడా మహత్తర ప్రపంచవ్యాపిత చారిత్రక ప్రాధాన్యత వుంటుంది. అంతర్జాతీయ వ్యవహారాలలో మనదేశ మూలవిధానాన్ని మన రాజ్యాంగం నిర్దేశించింది. ప్రపంచశాంతి, మానవాభ్యుదయాలనే పవిత్రాశయాలకోసం కృషిసలపడమే ఆ విధానం. మనదేశం సాధించిన, సాధించ

నున్న విజయాలు ప్రపంచప్రజలందరి ఉమ్మడి లక్ష్యమైన శాంతి, అభ్యుదయాలకు దోహదంచేస్తాయి. మన దేశం సోష లిస్టునిర్మాణం కొనసాగించాలంటే సుస్థిర ప్రపంచశాంతికోసం పోరాడటం తప్పనిసరి అవుతుంది.

మన దేశంలోని జాతులన్నీ దీర్ఘకాలంగా సాగించిన ఉమ్మడి పోరాటానికి ఘనవిజయం లభించిన ఫలితమే మనదేశ రాజ్యాంగచట్టం జారీచేయటం. అయితే, రాజ్యాంగం ప్రవేశ పెట్టబడినంతమాత్రంచేత, అందులోని అంశాలన్నీ వాటంతటవే పాటించబడతాయని భావించటంలేదు; అలా జరగదు. రాజ్యాంగము ఒకవైపు మనం గతంలో సాగించిన పోరాటాల క్రోడీకరణ, మరొకవైపు మనం ప్రస్తుత పోరాటాన్ని కొన సాగించడానికి ప్రాతిపదికగా, అది మనకు ప్రాథమికచట్టాన్ని ప్రసాదిస్తోంది. మన జాతీయ జీవనంలోని ముఖ్యమైన అంశాలలో ఏది న్యాయసమ్మతం, ఏది న్యాయపూరితమైన బాధ్యత, ఏది చట్ట విరుద్ధం, ఏది నిషిద్ధం ఇవన్నీ రాజ్యాంగం స్పష్టపరుస్తోంది. రాజ్యాంగం అమలు పరచబడిన తర్వాత, రాజ్యాంగాంశాలకు వ్యతిరేకమైన విషయాలు, వాటంతటవి అదృశ్యమైపోవు. ఐతే, రాజ్యాంగం మనకు బలోపేతమైన ఆయుధమై, వాటిని నిర్మూ లించడానికి గట్టి పోరాటం సాగించేందుకు అవకాశమిస్తోంది. మనదేశంలో సోషలిస్టు సమాజంలోకి రూపొందించబడాలని రాజ్యాంగం ఆజ్ఞాపిస్తున్నది. అయితే, దాని అర్థం సోషలిస్టు సమాజం ఎక్కడో తయారై వస్తుందని కాని, మనం చేతులు జోడించుకుని దానికోసం ఎదురు చూస్తామని కానేకాదు.

మనం పయనించవలసిన మార్గం యింకా చాలవుంది. అది మిక్కిలి కంటకావృతమైనదికూడా. దానిలో నడవడం సులభం కాబోదు. రాజ్యాంగం ప్రాముఖ్యత గొప్పది. కాగా అది మన కిచ్చే కర్తవ్యం మరింత ఘనమైనది. మన మార్గంలో నున్న వివిధములైన ఇబ్బందులను అధిగమించడానికి కష్టతరమైన పోరాటాన్ని, అచంచల కార్యదీక్షను, నిరంతర అధ్యయనాన్ని చేయడం ద్వారానే, మనం మన గమ్యాన్ని చేరుకోగలము. అందుచేత, మనం ఈవరకే సాధించిన విజయాలగురించి ఏమాత్రం ఆత్మవంచనా భావంతో ప్రవర్తించడంగాని, డాంబికం వహించడంకాని కూడదు. ఈ విధమైన మన స్తత్వం ఏ వ్యక్తికైనా, వర్గానికైనా, రాజకీయ పార్టీకైనా, జాతికైనా, హాని కలిగించడంతప్ప మేలుచేయవు. మన రాజ్యాంగచట్టం అమలును హర్షిస్తూనే, మనదేశంలో జాతులన్నీ మరింత సమైక్యంకావాలి. రాజ్యాంగం సూచించే మార్గంలో, చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, రాజ్యాంగం పూర్తిగా అమలుపరచబడేట్లు, మనదేశం గొప్ప సోషలిస్టుభూమిగా నిర్మితమయ్యేట్లు మరింత కృషిసాగించాలి.





మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPCLA108B117 |
| పుస్తకం పేరు | చైనా రాజకీయ చరిత్ర |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 139 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CJ, 42B, 42D, 42F, 42J, 44 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | PRAGATHI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |